ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.
సంపాదకుడు :
ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౪. ధాతు, మార్గశిరము : డిశంబరు, 1936. సంచిక : ౪.

# ఆత్మసంస్కారము

కవికొండల వెంకటరావు

"ఇప్పటికో మడతమంచం మనం సంపాయించుకోగలిగాం!" అని అంటూవుంది ఓఅమ్మి తనముందు కోతినెట్టుకుని. అలా అంటూవుంటే—పెంపుడుకోతి అది, బిచ్చగాండ్రకోతి అది,—ఊరికే ఆమడతమంచం మీదికెక్కి పిల్లిమంత్రాలేస్తూ కిందకు దిగుతూ వినోదంకలిగిస్తూవుందా అమ్మికి.

అనతిదూరంలోనే గోదావరీస్రవంతి ప్రవహిస్తూవుంది క్రొందేటనీటితో. సంధ్యారాగసుకాంతి యెఱ్ఱనిరంగుతో పశ్చిమాకాశవీధిని అలముకుంటూ వున్నప్పటికిన్నీ, శీతాకాలప్పొద్దవడంవల్ల చాకలివాళ్ళు బట్టలింకా బాగా ఆరలేదనుకుంటూ చాకిరేవుసందడినే యున్నారు. తీరసమప్రదేశాన్ని తాత్కాలికంగా కఱ్ఱలు పాతి అమర్చుకొన్న తాళ్లదండాలను ఎఱ్ఱవి, నల్లవి, ఆకుపచ్చవి, తెల్లవి, నీలానివి, గులాబీవి, కాఫీవి, పసుప్పచ్చవి,—ఎన్నిరంగులు ప్రపంచంలోవుండాలో అన్నిరంగులయుడుపులూ, పంచిలు, చీరలు, పంట్లాలు, కోట్లు, కమీజులు, కబ్బాలు, నిక్కర్లు, చొక్కాలు, జంపర్లు, జాకెట్లు, లంగాలు, లుంగీలు, దుప్పట్లు, గలేబులు, పరికిణీలు, వోణీలు, గోచీలు, గోణాలు, బనియన్లు, బాడీసులు లక్షోపలక్షలుగా గాలికాడుతూ వున్నాయి.

"ఇఖ మనకేంగావాలి?" అని అడిగింది ఆఅమ్మి ఆకోతిని. తనలో తానే జవాబుగా అనుకుంది ఆఅమ్మి "శీతకాలమొచ్చింది కాబట్టి ఓజుబ్బా నీకూ, ఓకబ్బా నాకూను. రేపడుక్కుందాం! ఏతల్లైనా యివ్వకపోద్దా?" అని ఆఅమ్మి అలా అనుకుంటూవుంది. కోతి వూరికే పిల్లిమంత్రాలేసేస్తూవుంది మడతమంచంమీద. కొంతసేపటికా అమ్మికేంతోచిందో "తిమ్మన్నా! మడతమంచం ఆలా తొక్కెయ్యడానిక్కాదు. దిగు" అని దాన్నిదింపి ఆమంచం కోటికట్టి

పారేసింది. కాస్సేపుగింజుకుని కోతి కిందే తొంగుడుండిపోయిం దుత్తి నేలమీదనే. ఆఅమ్మి అలా, మంచంమీద కోతిలేకపోయినా, కోతి పిల్లిమంత్రాలేయకపోయినా, ఇంకా ఆమడతమంచం కేసే చూస్తూవుంది.

మసకమసకగా చీకటికమ్ముకొస్తూవుంది. చాకలివాళ్లు బట్టలు మడతలెట్టుకుని మూటలు కట్టుకుని నెత్తికెత్తుకుని యిళ్ళకుపోతూ అనుకుంటూవున్నారు "సుబ్బక్క యీవేళ మడతమంచం సంపాదించిం"దని.

"ఏమిట్రా సుబ్బక్క మడతమంచంసంపాదించడంలోని విశేషం ? మడతమంచం సంపాదించటమనేది అంతగొప్పపనిట్రా !" అని అడిగితే వాళ్ళన్నారూ—"కాదుటండీ, జబ్బలడిపోయేటట్టు తెల్లాఉగట్లనుంచి యిద్యేల దాకా బల్లే మేం మేమే బల్లన్నట్టు బాదుకుంటేనేగాని చేరెడునూకలూ రావుగదా మాకు, దానికిచూడండి రోజూ కుంచెడుబియ్యం దొరకడమేకాకుండా యీయేల మడతమంచం దొరికింది. చేసేపని పట్నంలో కోతినాడించడం" అని అనుకుంటూపోయినారు.

సుబ్బక్క పక్కన నవ్వుతూ అంటించింది మాటొకటి ఆ చాకలాళ్ళను. "ఏంట్రా ! నన్నుగురించే అనుకుంటూవున్నారు ? మీకప్పుడే కడుపుబ్బుతూందట్రా ! కోతికి జుబ్బాలేదు, నాకు కబ్బాలేదు. చలేసుకొస్తూవుంది. ఒరేవ్ పోతిగా ! ఓరి చాకలిపోతిగా ! ఓదుప్పటీ ఇలాపారేసిపోదూ నీకు పున్నెముంటుంది. రేపిస్తాను మళ్లీని ;" అని అడిగింది.– పోతిగాడన్న చాకలి కొంచెం వెనక్కుతిరిగి సుబ్బక్కనుచూచి "దుప్పటీ కావాలేం ? నీకు ? దుప్పటీ ?" అంటూ చక్కాపోయినాడు.

క్షణికంలో గోదావరీతీరమంతా నిర్మానుష్యమైపోయింది. సుబ్బక్క వొక్కత్తే వుందక్కడ. వొక్కత్తేయేంలెండి ; కోతీవుంది. కోతీ తానూ కలిసి ఆనాడు సంపాదించుకున్న మడతమంచంవుంది. ఉండేంలాభం అవి ? దీపంలేదు ! దివిటీలేదు. చలేసుకొస్తూవుంది గడ్డిమొక్కకూకడాను.

ఆ చల్లో సుబ్బక్క తానానాడు సంపాదించుకున్న మడతమంచం ఎక్కికూర్చుని ఆలోచిస్తూవుంది. దేన్నిగురించి అంటే— ఆరోజుమధ్యాహ్నం పట్నంమధ్యనున్న ఆంజనేయస్వామిగుడిముం దొకపిధ్వజంతోకూడిన ఎత్తయిన ఆకాశదీపస్తంభం నెలకొల్పబడింది. ఆ స్తంభంయొక్క యెత్తునుగురించీ, దానిచివర అల్లాడిన ఆంజనేయస్వామివారి జండానుగురించీ ఆఅమ్మి అట్టే ఆలోచించడం ప్రారంభించింది. అలా ఆలోచించడం ప్రారంభించి ప్రారంభించి నిద్రపట్టక కళ్లు ఆతట్టుకు తిప్పింది. తానేజండానుగురించి ఆలోచిస్తూవుందో ఆజండాచెంత మినుకుమినుకుమంటూ చిన్నదీపం ముత్తెమంత వెలుగుతూవుండడం కనుక్కుంది.

"ఇప్పటికి చూడగలిగాను, ఇన్నాళ్ళకిక్కణ్ణుంచియో వెలుగు ; ఇప్పటికి చూడగలిగాను" అని అనుకుంది.

మంచంమీద కోతీచూచింది ఆవెలుగు, కోతి కిచకిచమంటూ అందికదా మనుష్యకంఠంతో—"సజీవంతోవున్న నాచుట్టూ చీకటిగావుంటే, ఎవరక్కడికి ఎక్కించుకుపోయినారు ? నిర్జీవమైన ఆకాశంలోకి ఆ దీపాన్ని ?" అని అడిగింది.

"అదీ నీలాగాడే జండావే ! దానిదగ్గఱ వెలుగుతూవుందాదీపం ! ఊరుకో ఆక్షేపే

లకు" అంది సుబ్బక్క.

"ఎవరాడిస్తున్నారు దాన్ని?" అని ప్రశ్న.

"మనిషే, దాన్ని నాలాంటిమనిషే" అని జవాబు.

"అందఱూ మనుష్యులే, అందఱూ కోతులే!" అంటూ చాకలిపోతిగాడు వచ్చేడు, పెద్ద మాసిపోయిన బట్టలమూటా వాడూ తూర్పింకా తెల్లారకుండానే.

సుబ్బక్క అంటుంది "పోతిగా! మడత మంచంమీదగానీ కూకునేవుగనక! ఇప్పటికి సంపాదించుకోగలిగాం ఓ మడతమంచం!"

పోతిగాడు :— ఎవరెవరు సంపాదించుకున్నా రీమడతమంచం? సుబ్బక్కా!

సుబ్బక్క :—"నేనూ, నాకోతీని" అంటూ అడిగింది పోతిగాణ్ణి—"ఆకాశదీపం ఆంజనేయునిగుడిముందీరేత్రి కొత్తగా వెలిగించింది చూచావా?" అని.

పోతిగాడంటాడు. "అన్నీదీపాలే! అన్నీ గుళ్లే!"

సుబ్బక్క అంటుంది. "తెల్లవార్లూ సలేసుకుపోయిందిరో!" అని,

పోతిగాడు :—మఱి దీపంసూశానంటున్నావు? దీపంసూశాక్కూడా సలే?

సుబ్బక్క :—సలి సలే! దీపం దీపమే! ఏమంటావు?

పోతిగాడు :—నీవేదాంతం నాకు తెలదు. తెల్లారి కోతీ నివ్వూ పోతారు. మాపటికి కుంచెడుబియ్యం తెచ్చుకుని యీ మడత మంచంమీదకూచుని ఏరుకుంటూ కూర్చుంటారు. మీదే అదృష్టం!

సుబ్బక్క :—పోతన్నా! నాకోకబ్బా నాకోతికోజుబ్బా యీవేల దొరికితే మరేం వొద్దు.

పోతన్న :—దొరుకుద్ది. [అని పోతాడు పోతన్న]

సుబ్బక్క :—"ఇప్పటి కోమడతమంచం వచ్చిందా మనకు! తిమ్మన్నా! ఇఖ నీకో జుబ్బా నాకోకబ్బా! లెగు! తిమ్మన్నా!" అంటూ తిమ్మన్నను. లేవగొట్టుకు సుబ్బక్క ముష్టికి పట్న మమ్మాట బయల్దేఱింది.

* * *

నాడు పట్నమంతా సుబ్బక్క ముఖంలో కొత్తవెలుగు చూచేరు. "సుబ్బక్కా! యీవేళ బాగున్నావు!" అని అంతాఅంటే సుబ్బక్క అంది "ఉన్నానుకమోను—తల్లుల్లారా! తండ్రుల్లారా! ఇన్నాళ్ళమల్లే కడచిన మాపు నేలమీదచెమ్మలో తొంగుదుండలేదు నేను. మీదయవల్లా మీదయవల్లా ఓ మడతమంచం నిన్న సంపాదించుకుని అందుమీద తొంగుదుండాను. అందుమూలాన్ని కమోను కాస్తంత జలుబూగిలుబూ వదిలి నేవళీకంగా కనబడుతున్నాను. అయినా చెప్పదగ్గఅందం నాలో ఏముంది? నేచూచిన దీపంలోవుంది!"

అలా అంటూంటే నిజంగా సుబ్బక్కకళ్లు మెఱిసిపోయినాయి. పట్నమంతా సుబ్బక్క ముఖంలో కొత్తవెలుగు చూచేరు.

విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొను పత్రికాముఖమున జిజ్ఞాస నలుపుటకును— ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైననుసరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.



### ౯౯. పీఠాధిపతులకు రాజచిహ్నములు

పీఠాధిపతులగు స్వాములు సన్యాసులా? లేక బ్రహ్మచారులా? వీరికి రాజచిహ్నము లేల యుండవలయును?

—అడిదము వెంకటరామారావు.

### ౧౦౦. కుక్కలకు బూరెలుపెట్టడం

మార్గశిరపౌర్ణమికి కుక్కలికి బూర్లు పెడతారు. ఈ ఆచారం మా నైజాంప్రాంతాల్లో హెచ్చు. ఇట్లా కుక్కలికి బూర్లుపెట్టడంలో మనవాళ్ళ ఉద్దేశం ఏమిటి?

—సన్నిధానము సుబ్రహ్మణ్యము.

### ౧౦౧. నగలుధరించే స్థానాలు

స్త్రీలు కటిస్థానానికిపైన బంగారునగలున్నూ దిగువను వెండినగలున్నూ పెట్టుకునే ఆచారంలోని అంతర్యంయేమి?

—వడ్లమన్నాటి రామారావు.

### ౯౬. స్త్రీలకు శుక్రధాతువుకూడ వుండునా?

ఆంధ్రభూమి ఆగష్టుసంచికలో 'పిల్లలువుట్టడానికి మగవానివీర్యం అవసరమా?' అను శీర్షికతో నేనువ్రాసిన వ్యాసంలో స్త్రీలకు శుక్రధాతువుకూడ వుండునని వ్రాసివున్నాను. నావ్రాతకు సుశ్రుతశారీరము, భావప్రకాశిక ఆధారములు. సుశ్రుతాచార్యులవారు స్త్రీలకుకూడ పురుషులకువలెనే స్థూలభాగమైన రసము ఒకమాసమునకు శుక్రమగుచున్నదనీ, స్త్రీ సమాగమమువల్ల పురుషునకు శుక్రము స్రవించేటట్లే పురుషసమాగమంవల్ల స్త్రీకికూడ శుక్రము స్రవిస్తుందనీ, స్త్రీ శుక్రము శుద్ధగర్భానికి కొంచెముకూడా వుపయోగకారి కాకపోయినా వికృతగర్భానికి కారణమౌతుందనీ స్పష్టంగా వ్రాసివున్నారు. దీనిని సమర్థిస్తూ భావప్రకాశకారుడు పురుషులకువుండే ధాతువులు ఏడేఅయివుండగా స్త్రీలకు ఎనిమిదిధాతువులువున్నాయనీ, ఆర్తవము వాళ్ళకు ఏడోధాతువనీ, శుక్రము ఎనిమిదోధాతువనీ వ్రాసివున్నాడు. స్త్రీలకు పురుషులకంటె గర్భాశయం ఒకటి ఎట్లు అధికమో అట్లే ధాతువుకూడా అధికమని తెలిసికోవలెనని భావప్రకాశకారుని మతం. మరిన్నీ అతడు స్త్రీలకు ఏడవధాతువయిన ఆర్తవం గర్భానికి వుపయోగిస్తుందనీ, ఎనిమిదవ ధాతువైన శుక్రం బలాన్ని, వర్ణాన్ని, పుష్టిని కలిగిస్తుందనీ స్పష్టపరచివున్నాడు. కాబట్టి స్త్రీలకు కూడా శుక్రధాతువు వుండుననేవిషయం శాస్త్రరీత్యా సిద్ధమైందేనని గ్రహింపవలసివుంది.

—టి. వెంకటరావు, బి. ఏ.

### ౯౭. ఆంధ్రదేశంలో జనాభాయొక్కసమ్మర్దం

1931-వ సంవత్సరపు జనాభాలెక్కలప్రకారం ఆంధ్రదేశంలో(పశ్చిమగోదావరిజిల్లా)తణుకు తాలూకాలో మిగిలిన అన్ని తాలూకాలలోకంటె చతురపుమైలుకి మిక్కిలి ఎక్కువమంది నివశిస్తున్నారని తేలింది. ఇచట చతురపుమైలుకు వెయ్యిమంది నివశిస్తున్నారని ఆ లెక్కలు తెలుపుతున్నాయి. ఆంధ్రదేశపు తాలూకాల్లోనే కాకుండా మదరాసు రాజధానిలోని ఇతర తాలూకాల్లోకూడా చతురపుమైలుకి ఇంత హెచ్చుమంది మరియెచ్చటా నివశించటంలేదని ఆ లెక్కలు తెలుపుతున్నాయి. ఇక ఒకయింటిలో మిక్కిలి ఎక్కువమంది నివశించే పట్టణం మదరాసు తరువాత రాజమండ్రీయే అని ఆ లెక్కలు తేలుస్తున్నాయి. రాజమండ్రీలో దామాషాని ఒక్కొక్కయింటిలో ఎనమండుగురికి పైగా నివశిస్తున్నారు. మనరాజధానిలో మరిఏపట్టణంలోకాని ఒక్కొక్కయింటిలో ఇంత హెచ్చుమంది నివశిస్తూవుండలేదు.

—కె. నాగేశ్వరశాస్త్రి.

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము




బలహీనతవలన జనించు రుగ్మతలను ఆటంకపరచి, దేహమునకు సంపూర్ణ ఆరోగ్యమును, రక్తవృద్ధి, నరములకు పటుత్వము, కండపుష్టిని, భీమబలమును, తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచును.

జీ వా మృ త ము

ఆరోగ్యమును పునఃప్రతిష్ఠింపగల ప్రాణదాత.

---

# బాలభాస్కర



బిడ్డల లివర్ అండ్ స్ప్లీనువ్యాధులను పోగొట్టుటకును రాకుండచేయుటకును సిద్ధౌషధము.

కెమిస్టులవద్దను, స్టోరులలోను—దొరకును.

ఆ యు ర్వే దా శ్ర మ ము,

మ ద రా సు.

# ముసలితనం అడ్డురాలేదు

రచయిత :

ఆర్. రంగనాధశాస్త్రి

ఎవర్నిచూచినా ఇది యువకులయుగం అని అంటూవుండడం పరిపాటిగావుంది. ముసలి వాళ్ళని ఓమూల కూర్చోపెట్టి కార్యభారం అంతా యువకులే వహించాలనే తహతహ అన్నిచోట్లా బాగా తాండవిస్తూవుంది. యువకులకు వారి అర్హస్థానం ఈయవలసిందే. కాని అంతమాత్రంచేత ముసలివాళ్ళని మూలకు తోసెయ్యాలని ఎక్కడాలేదు. నలభై అయిదు సంవత్సరాలు దాటిన మనిషి ముసలివాడనీ, అతను ఇకమీదట యువకుడిలా పనిచేయలేడనీ, ప్రయత్నించినా అతని బుద్ధిబలం మందగిస్తూ వుండడంచేత యువకుడిగావుండినప్పటి అంతటిపని ఇక అతను చేయలేడనీ పలువురి భావమైవుంది. చాలామందివిషయంలో ఈ భావం నిజమైందనే చెప్పవచ్చు. కాని సర్వే సర్వత్రా దీనికి చెలామణీవుందంటే మాత్రం అంగీకరించడానికి అవకాశం ఆవగింజంతమాత్రమేనా లేదు.

మన హిందూదేశంవంటి ఉష్ణదేశాల్లో బుద్ధిబలం, శరీరబలం శీఘ్రంగా వికసిస్తాయి. శీఘ్రంగా నశిస్తాయి. మనజీవితవిధానంకూడా ఈపద్ధతికి తోడుపడేదిగానే వుంటుంది. కాని పాశ్చాత్యదేశాల్లోని కొందరి వ్యక్తుల వృత్తాంతాలు పరిశీలిస్తే వాళ్ళజీవితకాలంలో వాళ్లుచేసిన పనులన్నిటిలోకి అత్యుత్కృష్టమైన పనిని వారు ముదిమిచే కప్పబడిన తరువాతనే చేశారు. నేటియువకుల నియమప్రకారం అయితే ఆముదుసళ్లు అందరూ మూల కూర్చోవలసిందే. అట్లే ఐవుంటే వారి పరిణత బుద్ధి ప్రసాదించిన ఫలాలన్నీ మానవలోకానికి లేకుండా వుండేవి.

ఆర్నాల్డు అనేవాడు మహామేధావిన్నీ, పీనుమిగిలిన వ్రాతకాడున్నూ. పండు ముసలితనం ఆతన్ని ముంచినాకూడా అతని మేధస్సు ఎప్పటి నైశిత్యంలోనే వుండేది. ఎనభయ్యోయేట ఆతను జోసిఫస్ గ్రంధాన్ని భాషాంతరీకరించాడు. ఎనభై రెండోయేటకూడ అతని బుద్ధిబలం ఎప్పటిలాగేవుంది.

సర్ హెన్రీస్పెల్మాన్ అనేవాడు చిన్నతనంలో శాస్త్రవిజ్ఞానసముపార్జనంలో పాలుమాలినాడు. ఏభయ్యోయేట మొదలు శాస్త్రవిజ్ఞానసముపార్జనానికి పూనుకొన్నాడు. ఇదే మనవాళ్లు ఐతే అరవైయేళ్లువచ్చేక చదువుకోక మన్నుకొట్టుకుంటూనా అని చదువు ప్రయత్నంమానేస్తారు. స్పెల్మాన్ ఏభైయ్యోయేట చదువుకు ప్రారంభించి అచిరకాలంలోనే గొప్ప విద్వాంసుడైనాడు. యువకుడుగా అతను పెద్ద ఎస్టేటుకు కామందై వుండడంచేత వ్యవసాయపు పనులే అతనిపూర్తి కాలాన్ని పుచ్చుకునేవి. కాని కొంతకాలానికి ఈ ఎస్టేటుకు వ్యాజ్యెంరావడం అది అన్యాక్రాంతం అవడంతో వ్యవసాయంఅంటే అతనికి పూర్తి నిరుత్సాహంకలిగి కృషిసంబంధమైన పనుల నుండి పూర్తిగా పరాఙ్ముఖుడయ్యాడు. అప్ప

టినుంచి విద్యావిషయంలో అనంతమైన దీక్ష వహించి తనకు ఇతరత్రా ఉన్న భూములన్నీ అమ్మేసుకుని పురాతత్త్వశాస్త్రంలో ప్రత్యేకాభిమానం చూపిస్తూ ఆనాటి గొప్పలాయర్లలో ఒకడై వెలుగొందేడు.

డాక్టర్ జాన్సన్ ఇక తాను కొద్దిరోజులకు చచ్చిపోతాననగా డచ్చిభాష నేర్చుకోడానికి ప్రారంభించేడు. బాగా ముసలివాడయ్యాక విలాసార్థం అతను ఒకనాటిపుదయం వర్జిల్ కావ్యంలోని నూరుపంక్తులను కంఠస్థం చేశాడు. డెబ్బయిమూడో యేట అతనికి పక్షవాతంవచ్చింది. పలుకురావడం బహుకష్టంగా ఉండింది. అల్లాంటి సమయంలో తనబుద్ధిబలం నశించిందో సరిగ్గావుందో చూసుకోడానికి గాను అతను లాటిన్ భాషలో ప్రార్థన పద్యాలు వ్రాశాడు.

ఆంగ్లకవి శిఖామణి ఛాసర్ తన కాంటర్బరీ కథల్ని నిండుముసలితనంలోనే వ్రాశాడు. తనకు యాభైనాలుగేళ్లు పైబడితేకాని ఆ కథలరచనకు అతను పూనుకోలేదు. అరవై ఒకటో యేడు నిండేసరికి అతను ఆకథల రచనం పూర్తిచేశాడు.

బెన్వెనుటో సెల్లినీ అనే అతను రచియించిన స్వీయచరిత్ర ప్రపంచంలోని స్వీయచరిత్రల అన్నిటిలోకి వుత్తమమైందని సారస్వత విమర్శకుల నిర్ణయం. ఆస్వీయచరిత్రని ఆ గ్రంథకర్త ఏభైఎనిమిదేళ్లు నిండిన పెద్దతనం పైనబడేవరకు ప్రారంభించనేలేదు.

ఆంగ్లకవులందరిలోకీ డ్రైడన్ అనేవాడు పద్యాల్లో బహుళగ్రంథాలు రచించేడు. ఇంతటిబహుళమైన పద్యరచన సాగించిన ఆంగ్ల కవి మరిఒకడు లేడు, అతగానికి ఇరువైఏడేళ్ళు నిండేవరకు అతనికి కవితాత్మ ఉన్నట్టే తెలియరాలేదు. అరవైయెనిమిదేళ్ళు నిండినతరువాతనే అతను హోమర్ యొక్క ఇలియడ్ ను భాషాంతరీకరించడానికి దొరకొన్నాడు. అతని రచనల్లో మనోజ్ఞమైనవన్నీ ముసలితనంలో వ్రాసినవే.

మైకేల్ యాంజిలో అనేవాని కల్పనాశక్తి పండుముసలితనం పైబడేవరకు నిలిచేవుంది. చిన్నపిల్లలతోపుడుబండిలో కూర్చుని గడియారందగ్గర పెట్టుకుని 'నేనింకా నేర్చుకుంటూనేఉన్నా' అంటూ ఒకముసలివాడు చెపుతూన్నట్లు ఒకవ్యంగచిత్రాన్ని అతను తయారుచేయించేడని ప్రతీతి.

సర్ క్రిస్టోఫర్ రెన్ను అనేవాడు ఎనభైఆరేళ్ళు నిండినా ప్రజాహితజీవితంనుండి విశ్రాంతి తీసుకోలేదు. తరువాత ఐదేళ్ళు అతను సారస్వతగ్రంథాలూ, మతగ్రంథాలూ, ఖగోళశాస్త్రగ్రంథాలూ కూలంకషంగా చదివి విడిచాడు.

డాక్టర్ ఫ్రాంక్లిన్ అనేవాడు వయస్సు ఎంతముదిరినా చదువు, వ్రాత, సద్గోష్ఠి బుద్ధిబలాన్ని పరిణతస్థితిలో వుంచుతాయండానికి అమోఘనిదర్శనమై ఉండినాడు. ఎనభైనాలుగేళ్ళునిండిన వృద్ధాప్యంలోకూడా అతని చదువులోకాని, వ్రాతలోకాని, సంభాషణలోకాని ముసలితనపు పోకిళ్ళు మందుకేనా కనుపించేవికావు.

పదహారోశతాబ్దిలో ఎక్కార్సో అనేవాడు ప్రసిద్ధిచెందినలాయరై వుండెను. అతను వయస్సు మళ్లినతరవాత న్యాయశాస్త్రపఠనానికి పూనుకున్నాడు. ఇంత పెద్దతనమందు ఈ న్యాయశాస్త్రపఠన మేమిటని ఎవరేనా అంటే పెద్దతనంపైబడుతోంది కాబట్టే దీన్ని తొందరగా నేర్చుకోవాలనేవాడు.

వయస్సు మళ్లినతరువాత చదువుకొని అనంతకీర్తిని గడించినవారియందు నెక్కర్

ఒకడు. అతను అన్నాడుకదా 'డెబ్బయియేళ్ల వృద్ధాప్యం గ్రంథరచనకు మంచి అనుకూలమైనకాలం. అప్పుడు నీబుద్ధిబలం తన నైశిత్యాన్ని, జిగీషను కోలుపోదుసరిగదా దానికి కొత్తగా తితిక్ష అనేసుగుణం ఓటి జతపడుతుంది' అని.

లానెథీ లివైజర్సుయొక్క గ్రంథంలోని మొదటిదైన క్రింది వాక్యం ఈసందర్భంలో పఠించవలసిందిగా వుంది : 'ముసలితనమందు ప్రతీవాళ్లు తమకు ఏమీపనిలేదని చెప్తారు. ముసలితనమందు పనిలేమిఅనేది ఓప్రబల జాడ్యం అని నామతం. దీనినిగూర్చి నాజీవితకాలంఅంతా నిరశిస్తూనేవచ్చేను. ఎనభై ఏళ్ళు నిండిన ఈవయస్సులో నేనుకూడా పనిలేమిఅనే జాడ్యానికి లొంగిపోతే దేవుడు నాకిచ్చిన ముసలితనమనే శ్రేష్టమైనవరాన్ని తృణీకరించినవాడినే అవుతాను.'

యువకులైనవారు ఈవ్యాసం చదివి నాకు ఏదో ముసలితనపుభావం ఆవహించిందని అనుమానపడితే పడవచ్చు. కాని పైసంగతులన్నీ వ్రాసినతరవాత నాలోనాకే యువకభావం తరంగితమాతూవుంది. ముసలితనమందు ఇంతటిపనులుచేసిన ఈ మహనీయుల సంగతి నాకు నూతనోత్సాహాన్ని కలిగిస్తూవుంది. కాని వృద్ధుల్నిగూర్చి ఇంతగా చదవడంవల్ల మీకు పెద్దతనపుభావం కలిగితే కలగవచ్చు. ఈ నిదర్శనాలు పెద్దవాళ్లల్లో యువకభావాల్నీ, యువకుల్లో పెద్దతనపు భావాల్నీ కలిగించేవిగా ఉన్నాయనిమాత్రం చెయ్యాయెత్తి చెప్పగలను.

# స్టార్ కంబైన్సు వారి

రెండవ తెలుగు టాకీ

## సారంగధర



ఎన్నివందలమారులు రంగస్థలమునందు చూచినను
ఆంధ్రులు విసుగుచెందియుండని రసవత్తర ప్రేమగాథ 'సారంగధర'

ముఖ్యపాత్రధారులు.

| | |
|---|---|
| అద్దంకి | శ్రీరంజని |
| కనకలింగేశ్వరరావు | శాంతకుమారి |
| పులిపాటి | బాలామణి |
| ఆకుల | శకుంతల |
| కే. ఆర్. రావు | తిలకం |
| నగరాజరావు | మోహన |

**Star Combines, Limited.**

161, Mount Road, Madras.

# మహాలక్ష్మమ్మ

[పడరానిపాట్లుపడి ప్రభువంశమును నిలిపిన ఆంధ్రబ్రాహ్మణ్య స్త్రీరత్నము చరిత్ర.]

ప్రాపుఁ గొనురాజభక్తి సౌరభమె కురియు
నెడద క్రొంబూవుతోడ హర్షించుకొనెడు
పూతచరితయౌ 'మహాలక్ష్మి'బోలు సతుల
నాంధ్రభూఁడా! కాంచిగర్వమ్మునందుమయ్య!

—శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మ.

పెద్దాపురసంస్థానమును రెండువందల సంవత్సరములకు క్రితము వత్సవాయి రాయపరాజు అనువాడు పాలించుచుండెను. అతనిభార్య పేరు రాగమ్మ. ఆ రాజదంపతులకు తిమ్మరాజు, బలభద్రరాజు అను ఇద్దరుకొమాళ్ళు కలిగిరి. కుమారులు పెరిగి పెద్దవారు కాకుండగనే రాయపరాజు చనిపోయెను. అందుచేత సంస్థానవ్యవహారములను రాగమ్మ చక్కబెట్టుచుండెను.

కొంతకాలమునకు కుమాళ్లు పెరిగి పెద్దవారైరి. పెద్దకుమారుడగు తిమ్మరాజునకు పెళ్ళికూడనయ్యెను. అప్పుడు రాగమ్మ సంస్థానవ్యవహారము లతనికప్పజెప్పెను. తిమ్మరాజును తల్లియందలి గౌరవముచేత నన్నికార్యములందు నామె సలహాపుచ్చుకొని వ్యవహరించుచుండెను. మఱికొంతకాలమునకు తిమ్మరాజున కొకకుమారుడు పుట్టెను. రాగమ్మ చిట్టిమనుమనికి 'రాయజగపతి' అని పేరుపెట్టెను. మనుమలనెత్తితినని రాగమ్మ సంతోషమున పొంగిపోయెను. కుమాళ్ళతండ్రినైతినని తిమ్మరాజు మిన్నుముట్టెను. రాయజగపతి కేడుమాసములు నిండెను.

అంతలో రుస్తుంఖానుడు అను తురక సేనానాయకు డీదేశమునకు వచ్చెను. రుస్తుంఖానుడు గొడ్డుకసాయివానికంటెను రాయి గుండెకలవాడు. అతని కేకోశమునందును దయయన్నది లేదు. అతడు మాయలమారి. ఎట్లాగునన్నైన పెద్దాపురముకోటను లోబఱచుకొనవలెనని యతని కొకదుర్బుద్ధిపుట్టెను.

కావున నతడు పోయి పెద్దాపురము కడనున్న పాండవులవారి మెట్టమీద డేరాలు వేయించుకొని యందు దిగెను. అచ్చటదిగియాతడు రాగమ్మతో రాయబారములు నడప ప్రారంభించెను. 'మీసంస్థానము చాల కాలమునుండియున్నది. ధర్మపరిపాలనకు బెట్టిన పేరై యొప్పుచున్నది. మీ సంస్థానమనిన నాకు జాల గౌరవముకలదు. కావున ధర్మప్రభువులగు మీ కొమారుల నొకసారి మాబసకుం బంపగోరెదను. వారిదర్శనము చేసి, వారిస్నేహము పొంది నేను వెళ్ళిపోయెదను.' అని రుస్తుంఖానుడు రాగమ్మకు గబురు పంపెను.

ఈ మాటలు నిజములనినమ్మి రాగమ్మ తిమ్మరాజును, బలభద్రరాజును ఖానునిడేరాకు బంపెను. వారివెంట నమ్మినబంటగు చల్లా పెద్ది అనువాడును, మఱి ముగ్గురునలుగురు సేవకులును మాత్రముండిరి. ఇట్లు వచ్చిన రాజకుమారులను తీసికొనిపోయి రుస్తుంఖా

నును తనడేరాలో గూర్చుండబెట్టుకొనెను. వారికి నాతడీమాటయు నామాటయు జెప్పుచుండెను. ఇంతలో గొందఱు తురకభటులు సలసలకాగు నూనెబిందెలను తెచ్చి డేరాలో నుంచిరి. ఉసుకుమడ్లువంటి ఆనూనె బిందెలలో జొన్నకంకులుముంచి తురకభటులు రాజకుమారులను కొట్టిరి; కళపెళక్రాగు నూనెను వారిపై దిమ్మరించిరి. రెప్పపాటులో తిమ్మరాజును, బలభద్రరాజును ప్రాణములు విడిచిరి. ఏమియు నెఱుగనివానివలె రుస్తుంఖాను డొకప్రక్క కొత్తిగిల్లెను.

రాజకుమారుల వెంటవచ్చిన చల్లాపెద్దియిదిచూచి గుఱ్ఱము నెక్కి పెద్దాపురము కోటలోనికుడాయించెను; జరిగిన మోసము రాగమ్మకుజెప్పెను. అప్పుడు రాగమ్మ 'రుస్తుంఖానుడు మోసముచేసి పుత్రులను చంపినాడు. ఇక వాడు కోటమీదబడును. చూచుచునూరకున్నచో మానముదక్కదు' అని తోడిస్త్రీలతో బలికెను. 'ఈ మాశరీరములగ్నిహోత్రమున కాహుతినిత్తుముకాని తురకవాని చేతులలో బడనీయము' అని ఆస్త్రీ లొక్కపెట్టునబల్కిరి. 'అయినయెడల లక్కమేడకు బోవుదమురండు' అని రాగమ్మ వారిని పిలుచుకొని పోయెను:

రాయజగపతి అను పేరుగల చిట్టిమనుమని నెత్తుకొని రాగమ్మ కడసారి ముద్దుపెట్టుకొనెను; మనసార దీవించెను. ఎదుట నిలిచియున్న కొంపెల్ల మహాలక్ష్మిసోదెమ్మ అను బ్రాహ్మణస్త్రీని చూచి రాగమ్మ యిట్లు చెప్పెను:

'అమ్మా! చాలకాలమునుండి మా వత్సవాయి వంశమునకు మీ కొంపెల్లవారు పౌరోహిత్యము చేయుచున్నారు. మీకును, మాకును సంబంధ మీనాటిదికాదు. కావున మీరీకష్టసమయమునందు మమ్ము కనిపెట్టవలయును. వత్సవాయివారి వంశ మింతతో దుదముట్టకుండ నీ యేడుమాసముల మొలకయెట్లైన నిలచియుండవలయునని నాకోరిక. ఈబిడ్డ నిప్పుడే మీచేతులలో బెట్టుచున్నాను. ఇక నీపసిబాలునకు తల్లియైన తోడైన మీరే. తురకల చేతులలో బడకుండ నీబిడ్డను మీరు విజయనగరమునకు దీసికొని వెళ్ళవలెను. విజయనగరసంస్థానపాలకులగు పూసపాటివారు మాకు దగ్గఱచుట్టములు. ఇచ్చటి సంగతులు మీరు చెప్పితిరేని వారీబిడ్డను తప్పక కాపాడుదురు. తల్లీ! ఇందుకు మీరు త్రికరణశుద్ధిగా నొప్పుకొనినగాని నేను నిశ్చింతతో నగ్నిప్రవేశము చేయజాలను.'

ఆమాటలకు మహాలక్ష్మమ్మ తోడనే యిట్లు బదులుచెప్పెను: 'మాకొంపెల్లవారు మీయన్నముతిని బ్రతుకుచున్నారు. మీకార్యము చేయుట మాకు విధి. ప్రభువుకార్యము తప్పకుండ నెఱవేర్తును. నాకంఠమునందూపిరియాడుచుండగా రాయజగపతి కెట్టికీడును రానీయను. ఇవి నాభిదగ్గఱనుండి వచ్చినమాటలు కాని నాలుకచివరమాటలు కావు.' లక్ష్మమ్మచెప్పినమాటలు విని రాగమ్మ నిశ్చింతతో లక్కమేడకు జిచ్చుపెట్టుకొని తోడిస్త్రీలతో లయముపొందెను. కోట తురకల స్వాధీనమాయెను.

పిల్లవాని నెత్తుకొని మహాలక్ష్మమ్మ పారాచౌకీల దగ్గఱకువచ్చెను. అచ్చట ఆమెకు గొందఱు తురకభటు లెదురుపడిరి. రాచకళతో నామె చంకలో నొప్పుచున్న చిన్నిబాలుని తురకభటులు చూచిరి. వారికి సందేహముతోచెను. అందుమీద వారామెను

అటకాయించి 'అక్కడాగుము. వీడు రాజకుమారుడు. ఎచ్చటికి దీసికొని పోయెదవు?' అని గద్దించియడిగిరి.

తోడనే యామె 'అయ్యో! ఇదియేమి కర్మము? తొమ్మిదినెలలు మోసి కనిపెంచిన నాపిల్లవానిని రాజకుమారు డందురేమి? మీకేమి మతిపోయినదా? లేక లోకజ్ఞానము చాలని బ్రాహ్మణస్త్రీగదా యని నన్ను డబాయించుచున్నారా?' అని భయపడక మాటాడెను. 'ఈపిల్లవాడు నీకొడుకైన యెడల వీని యెంగిలి తిని మాయనుమానము తొలగింపుము.' అని యొక తురకవాడు జామిపండొకటి లక్ష్మమ్మకిచ్చెను. వెంటనే యామె ఆపండు బాలునినోటిలోబెట్టి పిమ్మట తాను తినివేసెను. అప్పుడు తురకభటులు బాలునితోగూడ లక్ష్మమ్మను వదలిపెట్టిరి.

లక్ష్మమ్మ నిష్కళంకు సదాచారసంపత్తి గలవైదిక బ్రాహ్మణుల ఇంటబుట్టినది. వత్సవాయి క్షత్రియకుటుంబమునకు పౌరోహిత్యముచేయుచున్న కొంపెల్లవారి కోడలైనది. అట్టియామె స్వామికార్యముకొఱకు కులము నువిడిచినది. 'కులమునకేమి? రాజకుమారుని కాపాడగలిగితిని. పెద్దాపుర రాజవంశమును నిలుపగలిగితిని. వత్సవాయివారి యన్నము తిని మా కొంపెల్లవారు చాలకాలమునుండి వారికి ఋణపడియున్నారు. ఆప్రభువుల ఋణ మీవిధమున దీర్చుకొంటిని.' అని ఆరాజభక్తురాలుప్పొంగిపోయెను.

తురకలను మోసపుచ్చి కోటదాటి లక్ష్మమ్మ పెద్దాపురములోని తనయింటికి బాలుని తీసికొనివచ్చెను. తనభర్త కామె నడచిన వృత్తాంతమంతయు విన్నవించెను. అందు మీద నాబ్రాహ్మణుడు తనభార్య రాజభక్తికి మెచ్చుకొనెను. భార్యను, రాజకుమారుని వెంటబెట్టుకొని యాతడు విజయనగరమునకు బ్రయాణమయ్యెను.

నిజమెఱుగలేక తనభటులు రాజకుమారుని వదలిపెట్టినసంగతి రుస్తుంఖాను డెట్లో తెలిసికొనెను. బాలుని తిరిగి పట్టుకొనుట కాతడెంతో ప్రయత్నించెను. పాప మాబ్రాహ్మణదంపతులు బాలునితో చేబ్రోలుఅను గ్రామముకడ దొరికిపోయిరి. వారిని ఖానుడు పెద్దాపురమునకు తీసికొనివచ్చెను.

ఆతడు తన బిడ్డయేకాని రాజపుత్రుడు కాడని మహాలక్ష్మమ్మ యెంతగోలపెట్టియేడ్చినను ఖానుని కటికిగుండె కరగలేదు. 'ఇతడు బ్రాహ్మణబాలుడో, రాచబిడ్డడో పరీక్షించెదను.' అని ఖానుడు కత్తులను, పుస్తకములను బాలునిముందఱ నుంచెను. అసలింటి రాచబిడ్డ కావున నా రేడుమాసములకసుగందు కత్తిమీాద జేయివేసెను. రాయిగుండెకల రుస్తుంఖాను దదిచూచి 'ఇది పులిపిల్ల కాని మేకపిల్లకాదు' అనెను; రాయజగపతిని ఖైదుచేసెను.

రాజకుమారునకుగలిగిన దురవస్థకు రాజభక్తురాలగు మహాలక్ష్మమ్మ మనస్సు చిచ్చుదగ్గఱ వెన్నవలె గరగిపోయెను. ఆమెకు పొర్లి పొర్లి దుఃఖమువచ్చెను. కొంతసేపటికామె ధైర్యము తెచ్చుకొనెను. 'సమయము కనిపెట్టి పాలీయనిచో నాలుకయిగిరి వడగొట్టి బాలుడు చనిపోవును. కావున నన్నుకూడ నా బిడ్డతో ఖైదుచేయుము.' అని లక్ష్మమ్మ ఖానుని కడుపుపట్టుకొని బ్రతిమాలెను; వాని కాళ్ళుపట్టుకొని బామాలెను. అప్పుడు ఖానుడు లక్ష్మమ్మ బాలునివద్దనుండుట కొప్పుకొనెను. ఒకరిచేత బ్రొమొక్కులుకొనుటయే

కాని యెన్నడు నితరులకు జేయెత్తిమ్రొక్కి యెఱుగని ఆ బ్రాహ్మణ స్త్రీ యిప్పుడు మఱియొకమతమునకుజెందిన వానికాళ్ళు కడుపు పట్టుకొనెను. రాజకుమారునికొఱకు కారాజభర్తురాలిట్టి పడరాని కష్టములు పడుచుండెను.

చెఱసాలలో రాయజగపతిస్థితి యోరుగాలిలో దీపమువలెనుండెను. రుస్తుంఖానుడా బాలునకెప్పటికెట్టిఘాత తలపెట్టునోయని లక్ష్మమ్మ భయపడుచుండెను. ఆమె తనసుఖమును మఱచి పిల్లవానిని కాపాడుచుండెను. రాయజగపతి బాలారిష్టములు తప్పించుకొని పెద్దవాడై పెద్దాపురసంస్థానమునకు పాలకుడు కావలయునని లక్ష్మమ్మ వేయిదేవుళ్ళకు మ్రొక్కుచుండెను. వీలుకలిగినప్పుడెల్ల నామె ఖానుని భార్యవద్దకుబోయి తనకుమారుని రక్షింపవలసినదని ప్రార్థించుచుండెను. ఖానుని ఇల్లాలు పిల్లలను కన్నది. కావున నామె కనికారముగాని పెనిమిటి రాజకుమారుని చంపకుండ జాగ్రత్తచేసినది.

లక్ష్మమ్మ పెనిమిటి యిచ్చట జరిగెడి వర్తమాన మెప్పటికప్పుడు విజయనగరమునకు జేర్చుచుండెను. విజయనగరపాలకుడగు విజయరామరాజు రాయజగపతిని చెఱవిడిపించుటకు ప్రయత్నములు చేయుచుండెను.

ఇంతలో రుస్తుంఖానుని చంపి వాని కొడుకు నూరుద్దీను హుస్సేను అనువాడు పెద్దాపురమునుండి రాజ్యపాలనము మొదలుపెట్టెను. రాజ్యముకొఱకు దండ్రిని చంపిన నూరుద్దీను ఆ రాజ్యమునకు వారసుడైన రాయజగపతి నింక బ్రతుకనీయడని మహాలక్ష్మమ్మ యల్లడితల్లడి నొందెను. ఈవిషయమామె పెనిమిటి విజయనగరమునకువెళ్ళి పూసపాటి విజయరామరాజుతో జెప్పెను. విజయరామరాజున కేమిచేయుటకు దోచుట లేదు. 'బాలుని ఖైదుచేసినగదికిని కోటసింహద్వారమునకును నడుమ నేడు పహారాలు కలవు. లక్ష్మమ్మకుదప్ప మిగిలినవారికి రాజపుత్రుని చూచుటకే యాజ్ఞ లేదు. చెఱసాల దగ్గఱ మెఱియలవంటి పచ్చితురకలు విచ్చుకత్తులతో రాత్రింబగళ్ళు కాపుకాయుచుందురు. కావున యుద్ధముచేసి తప్ప రాజకుమారుని విడిపించుటకు మఱియొక మార్గము లేదు.' అని విజయరామరాజాలోచన చేసెను. 'కాని తొందరపడి దండుకూర్చుకొని పోయినయెడల నూరుద్దీను కోపించి చెఱలోనున్నబాలుని చంపునేమో?' అని ఆతడు సందేహించెను.

ఇంతలో నూరుద్దీను కళింగదేశమును జయించుటకు పెద్దాపురమునుండి తనసేనలతో బయలుదేఱెను. మంచిసమయము దొరికినదని విజయరామరాజు సంతోషించెను. తగుసిబ్బందిని వెంటబెట్టుకొని యాతడు రహస్యముగ పెద్దాపురము వచ్చిచేరెను. అప్పుడు మహాలక్ష్మమ్మ కావలివాండ్రకు మస్తుగా లంచమిచ్చి బాలునితీసికొని బయటకువచ్చెను. బాలుని ఆమె విజయరామరాజు చేతులలోబెట్టెను. రాజకుమారుని రక్షింపగల్గితినికదా యను సంతోషమున మహాలక్ష్మమ్మ యిదివఱకు దానుపడిన కష్టములనన్నిటిని ఒక్కసారిగా మఱచిపోయెను. అప్పుడు విజయరామరాజు బాలునితో, లక్ష్మమ్మతో విజయనగరమునకు దారితీసెను.

ఈ వర్తమానమెట్లో నూరుద్దీను హుస్సేనునకు దెలిసెను. వెంటనేయాతడుపోయి విజయరామరాజు నెదిరించెను. కాని యాయుద్ధ

మున హిందువులకే జయముకలిగెను; నూరుద్దీనుతల కొబ్బరిపుచ్చివలె నూఁగిపోయెను. ఆతనిభటులు లీగలవలె నెగిరిపోయిరి. అప్పుడు విజయరామరాజు బాలుని సురక్షితముగా విజయనగరమునకు తీసికొనిపోయెను. కొంపెల్ల మహాలక్ష్మమ్మ సోదెమ్మచేతిచలవవలన రాయజగపతి పెరిగి పెద్దవాడయ్యెను. అప్పుడాతడు తరతరములనుండి తనపెద్దలుపాలించిన పెద్దాపురసంస్థానమును జయించి పాలించెను.

లక్ష్మమ్మ స్వామిభక్తి సాటిలేనిది. అడుగడుగున నాపదలు హిమాలయపర్వతములవలె విఱిగి మీఁదబడుచుండినను బెంబేలుపడక ఆమె రాజకుమారుని కాపాడినది. ఆమె గడపదాటియెఱుఁగని స్త్రీ. పూనినది కొండంత ధైర్యము. ఏడుమాసముల రాచబిడ్డను కాపాడవలసి యున్నది. గొడ్డుకసాయివాడైన రుస్తుంఖానుని తోడను, రాజ్యము కొఱకు తండ్రిని చంపిన నూరుద్దీనుతోడను విరోధము. చెఱసాలలో మకాము. బాలునికి దినదినగండము. సాటిలేని స్వామిభక్తి యావేశించియుండ నామె ఈ కష్టముల నతిక్రమించినది. తుదకామె వత్సవాయివంశమును నిలిపినది; పెద్దాపురసంస్థానమునకు ప్రభుభిక్ష పెట్టినది.

'నాకంఠములో నూపిరియాడుచుండగా రాయజగపతి కేకీడును రానీయను.' అని రాగమ్మవద్ద ఆనాడు చెప్పినంత రాజభక్తురాలగు లక్ష్మమ్మ చేసినది. పాలుత్రాగు పసితనముననే 'నా అన్న' వారినెల్ల బోగొట్టుకొని చెట్టులేని పక్షివలె దిక్కుమాలియున్న రాజకుమారుని దగ్గఱకుదీసి రుస్తుంఖానును, నూరుద్దీను అను రాక్షసుల బారినుండి రక్షించిన ఈ రాజభక్తురాలి కీర్తి సూర్యచంద్రులుండునంతకాలము నుండును.

స్వార్థమెఱుగని లక్ష్మమ్మ రాజసేవానిరతికి మెచ్చి విజయనగరాధీశులామె పేరిట 'లక్ష్మీపురము' అను అగ్రహారమును కట్టించి యిచ్చిరి.

జీవితంపు సౌఖ్యమ్మెనశించిపోవఁ
గులమహోన్నతధర్మంబె కూలబడఁగ
బ్రతినవీడక కష్టసంద్రమున మునిఁగి
ప్రభునిసుతుఁ గాచె మామహాలక్ష్మి కనుఁడు!

—శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మ.







# ఇంగ్లండుకుక్కలు గొడుగుల్ని చూచి కూసినరోజులు

రచయిత :

ఆర్. శ్రీరామమూర్తి, బి. ఏ.

భారతదేశంలో గొడుగులు అనంతకాలం నుంచీ ప్రజలకు బాగా పరిచయమైనవస్తువులయిఉన్నాయి. కాని ఆ భారతదేశాన్ని ఇప్పుడు పరిపాలిస్తున్న ఇంగ్లీషువారికి మూడు వందలయాభై సంవత్సరాలికి పూర్వం గొడుగులంటే ఏమిటో తెలియదు. అసలువస్తువు స్వరూపమే తెలియనప్పుడు దాని ఉపయోగం మాత్రం ఎల్లా తెలుస్తుంది? ఆ దేశానికి గొడుగుల్ని పరిచయంచేసి వాన్ని అచట బాగా వాడుకలోకి తెచ్చినవ్యక్తి జొనాస్‌హాన్వే అనేవాడు.

జొనాస్‌హాన్వేకి బ్రిటిష్‌వారి చరిత్రలో మంచిస్థానమే ఉంది. అయినా ఇప్పుడు అతని పేరు బ్రిటిష్‌వారిలో వెయ్యింటికి ఒక్కనికేనా తెలిసిందై ఉండదు. కాని అతను కనుగొన్న గొడుగులవల్ల లక్షలకొద్ది మనుష్యులు సుఖాన్ని పొందగలిగారు, పొందుచున్నారు.

తొలిసారి హాన్వే ఇంగ్లండులో గొడుగుల్ని ప్రవేశపెట్టిన వృత్తాంతం చాలా వినసొంపుగావుంటుంది. సామాన్యజనులకు అందరికీ గొడుగుల్ని అందుబాటులోకి తీసుకురావాలని ప్రయత్నంచేసినందుకుగాను అతన్ని ఒక దేశాన్నుంచి వెళ్ళగొట్టారు. తీరా ఇంగ్లండు వెళ్ళి కష్టపడి గొడుగుల్ని తయారుచేసి మొదటిసారి గొడుగువేసుకుని వీధులోకి వచ్చేసరికి అతనివెంటపడి తుంటపిల్లకాయలు ఎగతాళి ఎక్కిరింపు మొదలుపెట్టేరు. ఆ దేశపు కుక్కలు అంతకుపూర్వం ఎప్పుడూ గొడుగుని చూచివుండని కారణంచేత హాన్వే వేసుకున్న గొడుగునిచూచి వింతపడి మొఱిగి కుయ్యడానికి ప్రారంభించాయి.

ఇంగ్లండులో మొదటిసారి గొడుగుల్ని ప్రవేశపెట్టిన ఈ హాన్వే పోర్ట్సుమాత్‌లో 1712-వ సంవత్సరం ఆగష్టు 12-వ తేదీని పుట్టాడు. అతను మంచిచొఱవకలవాడు. పోర్చుగల్ దేశపురాజధాని లిజ్బన్‌లో అతను మొదట వర్తకం ప్రారంభించేడు. తరువాత రష్యాదేశపు రాజధానిఅయిన సెంట్‌పీటర్సుబర్గులో వ్యాపారం మొదలుపెట్టాడు. అక్కడకూడా ఇంకా తాడుబారకుండానే తన ఉన్నిదుస్తుల వ్యాపారాన్ని పెరిషియా దేశంలో సాగిద్దామని అతనికి బుద్ధిపుట్టి అచ్చటికి వెళ్లాడు. రెండేళ్ళు అచట వ్యాపారం నడిపించాడు, తరువాత ఆ రెండేళ్ళలోను తనకు ఆ దేశాన్నిగూర్చి తెలిసినసంగతులన్నీ ఒకగ్రంథంగావ్రాసి ప్రచురించాడు.

మన ప్రస్తుతవిషయం గొడుగులు కాబట్టి హాన్వేకి గొడుగులికిగల సంబంధాన్ని వివరిద్దాం. ఒకనాడు అతగాడు పెర్షియాదేశానికి చెందిన టెహిరాన్ వీధుల్లో నడుస్తూవుండగా ఎదురుగా ఒకఊరేగింపు రావడం చూశాడు. ఆప్రాంతపు రాజు తన సామంత రాజులతో ఊరేగుతూ ఉన్నాడు.

ఆ ఊరేగింపును హాన్వే నిర్నిమేషదృష్టులతో చూశాడు. తనజీవితకాలంలో అట్లాంటి

ఊరేగింపు అతను ఎప్పుడూ చూచిఉండలేదు. ఊరేగుతూవున్నా ఆరాజు ఒక మేలుకట్టు క్రింద ఉన్నాడు. ఆ మేలుకట్టుకు నడుమ ఒక పొడుగైన కర్ర బోటుగాఉంది. మేలుకట్టు తళతళ మెరిసే మంచిపట్టుబట్టతో చేయబడింది. దాన్ని ఇద్దరుసేవకులు పట్టుకుని మోస్తున్నారు.

హాన్వే మంచిజిజ్ఞాసాపరుడు. కాబట్టి వింతఅయిన ఆ మేలుకట్టునుగూర్చి విచారణ ప్రారంభించాడు. ఈ విచారణవల్ల అతనికి తెలియవచ్చిన సంగతులు అతనికి చాలా వింతపుట్టించేవిగా ఉన్నాయి. పెర్షియన్ పండితులు దాన్నిగూర్చి చెప్పినసంగతులన్నీ అతను జాగ్రత్తగా మనస్సుకు పట్టించుకున్నాడు.

తళతళమెరిసే ఈ చాందినీ గొప్ప రాజచిహ్నము. అది అధికారానికి ఒక గొప్ప గుర్తు. అత్యంతప్రాచీనకాలంనుంచీ ఇది అట్టిదే అయిఉంది. గ్రీకుదేశంలో భూగర్భంలో పురాతత్వవేత్తలకి దొరికిన కూజాల మీద ఈగొడుగుముద్రలు ఉన్నాయి. ఈజిప్టు దేశంలో పూర్వకాలపు రాతిచెక్కడముల మీద రాజుల ఈ గొడుగుల ఊరేగింపు బొమ్మలు ఉన్నాయి. హిందూదేశంలో రాజుల గొప్పతగ్గులనుబట్టి గొడుగుల అలంకారాల్లోకూడా మార్పులు నిర్దేశింపబడి ఉన్నాయి. మహారాష్ట్రులు తమ ప్రభువుల్ని ఛత్రపతులు అని పిలుస్తారు. బర్మాదేశంలో తెల్లఏనుగులతోబాటు తెల్లగొడుగులుకూడా రాజులకు ప్రత్యేకింపబడ్డాయి.

ఛత్రం ఇట్లు ప్రత్యేకం రాజులకుమాత్రమే ఎందుకు చెందిఉండాలని హాన్వేకు జిజ్ఞాస బయలుదేరింది. రాజచిహ్నాలై ఇవి కొద్ది మందికి ఉపయోగిస్తున్నాయి. వీధుల్లో ఎండ నుండి సామాన్యజనుల్ని కాపాడ్డానికిమాత్రం వీటిని ఎందుకు ఉపయోగించకూడదు అని అతనికి ఆలోచన బయలుదేరింది. అట్లా చేయడంవల్ల వాటివినియోగం అతిశయిస్తుంది అని అతను నిజం అరసి నిశ్చయించుకున్నాడు.

అందరికీ అందుబాటులోవుండే గొడుగుల్ని తయారుచేయగలిగితే అవి వేలకొద్దీ, లక్షలకొద్దీ అమ్ముడౌతాయి అని అతనికి తోచింది. కాని ఇవన్నీ గాలిలోమేడలై ఊరుకున్నాయి. ఏమంటారా? పెర్షియా మొదలైన తూర్పు దేశాల్లో గొప్పకులాలు తక్కువకులాలు వీనికిఉండే కట్టుబాట్లు. మిక్కిలి దృఢమైనవి. ఈదేశాల్లో ఆ కట్టుబాట్లే ప్రభుత్వంచేస్తాయంటేకూడా అతిశయోక్తి అనిపించుకోదు. అట్లాంటిస్థితిలో పెర్షియాదేశపురాజులు తమ ఘనతకు ఒకచిహ్నంగావున్న ఛత్రాల్ని ఒకానొకవిదేశీయుడువచ్చి విరివిగా తయారుచేసి సామాన్యప్రజ లందరికీ అందుబాటులోకి తెస్తున్నాడంటే భరింపలేకపోయారు. హాన్వే వారి కోపదృష్టికి గురిఅయాడు.

రాజుకోపానికి గురిఅయి అతను ఇంక ఆదేశంలో సుఖాన ఎట్లా ఉండగలడు? ఉన్నట్టుండి అతను ఒకనాటిరాత్రి పెర్షియా దేశాన్ని వదిలిపోవలసివచ్చింది. కాని ఆదేశాన్ని వదిలిపోయేలోపుగ అతను కొన్నివందల గొడుగుల్ని తనదగ్గరకు చేర్చగలిగాడు. వానితో అతను ఇంగ్లండువచ్చిచేరాడు.

ఎండనుండి గొడుగులు మనుష్యుల్ని కాపాడగలిగితే వాననుండి, మంచునుండిమాత్రం అవి ఎందుకు కాపాడలేవని అతను ఆలోచన ప్రారంభించాడు. తనదేశపు శీతోష్ణస్థితికి కూడా గొడుగుల అవసరంవుందని అతను గుర్తించేడు. కాబట్టి ఇంగ్లండులోకూడా

గొడుగుల్ని ప్రవేశపెట్టడానికి అతను కృతనిశ్చయుడు అయాడు.

కాని హాన్వే ఇంగ్లండులో గొడుగుల్ని ప్రవేశపెట్టిన క్రొత్తలో అచ్చటిప్రజలు వీటికి ఏమాత్రం సుముఖులుగా ఉండిఉండలేదు. గొడుగు వేసుకుని హాన్వే మొదటిసారి వీధిలో నడిచిన మొదటినాడు జనం అతని వెంట తండోపతండాలుగాపడి గోలపెట్టి గల్లంతు చేశారు. అంతవరకు అల్లాంటివస్తువును చూచిఉండని కారణంచేత అచటి కుక్కలు ఆ గొడుగునుచూసి మోరలెత్తి మొఱిగి కుయ్యడం ప్రారంభించాయి.

కాని క్రమక్రమంగా గొడుగులంటే ప్రజలకు బాగా పరిచయంఅయింది. అవి అంటే వింతపడ్డం మానేశారు. క్రమంగా గొడుగును కలిగివుండడం ఒక ఫాషన్ అయిపోయింది. పెర్షియాదేశంలో ఉన్నప్పుడు అనుకున్నట్లుగా అతను ఇప్పుడు లక్షలకొద్దీ గొడుగులను విక్రయించేవాడు. వ్యాపారం విస్తరించింది. అతను విశేషధనం ఆర్జించేడు. ఆ ధనాన్ని అతను ఆత్మార్థమే కాకుండా పరార్థానికికూడా ఉపయోగించి పుణ్యాత్ముడు అయాడు. స్త్రీలకొఱకు ప్రత్యేకంగా అతను ఒక పెద్ద ఆసుపత్రి స్థాపించేడు. అధికధనాన్ని ఆర్జించి, అధికగౌరవాన్ని పొంది చిరకాలం జీవించి అతను పండుముసలితనంలో ప్రాణాలు వదిలేడు.

క్రొత్తగా గొడుగుల్ని దేశంలో ప్రవేశపెట్టడంలో అపహాస్యానికి పాత్రమైన హాన్వే ఆసంగతిని మరిచిపోయి క్రొత్తగా తేయాకు ఇంగ్లండుదేశంలో ప్రవేశపెట్టబడే సందర్భంలో దాన్ని ఎక్కువగా అపహాస్యం చేసేవాడు. క్రొత్తగావచ్చిన తేయాకు పానపద్ధతికి అలవడ్డ డాక్టర్ జాన్సన్ కవిని హాన్వేచేసిన ఎగతాళి ఇంతాఅంతాకాదు. కోడలు అత్తకాగానే తాను కోడలుగాపడ్డ బాధల్ని మరిచిపోతుంది. అట్లాగే హాన్వే తాను క్రొత్తగా గొడుగుల్ని ఇంగ్లండులో ప్రవేశపెట్టడానికి పడ్డ కష్టాలన్నీ మరిచిపోయి క్రొత్తగా తేయాకును ఇంగ్లండులో ప్రవేశపెట్టడానికి అడ్డుతగల ప్రయత్నించేడు.

---



మాస్టరు దుర్గాప్రసాద్, కమలకుమారి.

(బెజవాడ సరస్వతీటాకీస్‌వారి 'కనకతార' ఫిల్ములో నటించుచున్న పిల్లలు.)

# ఓషధీవిజ్ఞానము

[ద్రవ్యములు, దేశములు, ఓషధులు వీనినిగూర్చిన విషయవివరణము.]

రచయిత :

పండిత ములుగు రామలింగయ్య

## ౧

## —: ద్రవ్యములు :—

పంచభూతాత్మకములగు ద్రవ్యములు 1. జంగమద్రవ్యములు, 2. ఔద్భిదద్రవ్యములు, 3. పార్థివ ద్రవ్యములు అని మూడువిధములు.

1. జంగమ ద్రవ్యములు అనగా ప్రాణముకలిగి కదలునవి : మనుష్యులు, పశువులు, పక్షులు మున్నగునవి. వీనివలన తేనె, పాలు, నెయ్యి, పిత్తము, కొవ్వు, మజ్జ, రక్తము, మాంసము, మలము, మూత్రము, చర్మము, శుక్రము, ఎముకలు, నరములు, కొమ్ములు, గిట్టలు, గోళ్ళు, వెంట్రుకలు గ్రహింపబడుచున్నవి.

2. ఔద్భిదములనగా భూమిని పగుల్చుకొని పుట్టునవి (వృక్షములు) : ఇవి 1. ఓషధులు: (ప్రతివత్సరము పుట్టి ఫలించి నశించునవి.) 2. వనస్పతులు : (పూవులు పూయకనే ఫలించు మఱ్ఱి, మేడి, జువ్వి, రావి మొదలగునవి.) 3. వానస్పతులు: (పూవులుపూసి కాయలు గాచు మామిడి, నేరేడు, జామ, దానిమ్మ మొదలగునవి.) 4. వీరుధములు : (తీగెలు పొదలుగ నుండునవి.) అని నాలుగువిధములు.

3. పార్థివములు : బంగారు, వెండి, రాగి, ఇనుము, సత్తు, సీసము, తగరము, శిలాజిత్తు, ఇసుక, స్వర్ణమాక్షికము, తారమాక్షికము, కఫరి, ముదారుశింగు, మణిశిల, తాళకము, నవరత్నములు, ఉపరత్నములు, లవణములు, కాసీసము, అంజనపురాళ్లు మొదలగునవి.

## ౨

## —: దేశము. :—

ఇది 1. భూమిదేశము, 2. దేహదేశము అని రెండువిధములు. దేహదేశమన శరీరము. భూమిదేశము :



—వ్యాసకర్త.

జాంగల, అనూప, సాధారణములని మూడువిధములు.

1. జాంగలదేశము: స్వల్పోదకముకలిగి పర్వతములు, యెడారులుగల దేశము. ఇది వాతభూయిష్టము. ఇందు జనించునవి వాతాధిక్యతగలవిగ నుండును.

2. అనూపదేశము : జలాధిక్యముకలిగి వనము లధికముగ నుండి యెండతక్కువై నిర్మలమైన గాలి లేని దేశము. ఇందు జనించునవి కఫాధిక్యతగలవిగ నుండును.

3. సాధారణదేశము : వసంతాది ఋతులక్షణములు సక్రమముగ నడచుచు నిర్మలమైన జలాశయములు, నిర్మలమైనగాలి తగినన్ని వృక్షములు గలది. ఇందు త్రిదోషములు సమముగ నుండును. కావున ఔషధములను జేయుటకు సాధారణదేశమునుండియే యోషధులను సంపాదించవలెను.

## 3

## —: ఓ ష ధు లు :—

### గ్రహించదగిన ఋతువులు.

శరదృతువునందు ఓషధులు సరియైనరసములు కలిగియుండును. కనుక సర్వరోగహరణార్థ మీ ఋతువునందే యోషధులను సంగ్రహించుట యుక్తము.

గ్రీష్మకాలమం దవి రూక్షస్వభావముచేత రసవిహీనములై యుండును. వర్షకాలమం దధికరసము కలిగియుండును గాన నంత గుణవంతములుకావు. అయినను వమన, విరేచనముల కిచ్చు ఓషధులు తీక్ష్ణములై యుండవలెను. కనుక వానిని గ్రీష్మకాలమునందే సంపాదించవలెను.

### గ్రహించకూడని స్థలములు.

పుట్టలు, చెడుస్థలములు, జలాధిక్యముచేత చెమ్మగల స్థలములు, స్మశానములు, చవిటిపఱ్ఱలు, మార్గమధ్యము, దుష్టజంతువులుండు స్థలములు, కాలినచోటులు, అతిగ మంచుగలస్థలము ఇటువంటి స్థలములందుండు ఓషధులను గ్రహించరాదు. ఇవి మంచిగుణ మివ్వకపోవుటయేగాక చెడుగుణములనుకూడ నిచ్చును.

### గ్రహణవిధానము.

ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములలో నేదినమునవైనను ఉదయము స్నానముచేసి శుచియై సూర్యునకు నమస్కరించి హృదయమందు శివుని ధ్యానించుచు మౌనవ్రతుడై యోషధులను తీసుకొనిరావలెను.

### వీర్యవంతములై యుండు కాలవ్యవధి.

ఏయోషధినైనను అట్లే యుంచినచో భూమినుండి తీసినదిమొదలు ఒక సంవత్సరకాలమువరకును నవి స్వగుణములను గలిగియుండును. తరుపరి గుణహీనములగును. ఇట్లే చూర్ణములుగ జేయబడిన యౌషధములు రెండుమాసములవరకును; గుళికలు, లేహ్యములు ఒకసంవత్సరకాలము వరకును; ఘృతములు, తైలములు 16 మాసములకాలమువరకును గుణవంతములై యుండును.తరుపరి నిర్వీర్యములగును.

కందులు, మినుములు, పెసలు, శనగలు మొదలగు నోషధులు సంవత్సరము మించినయెడల చెడిపోవును.

ఆసవములు, అరిష్టములు, ధాతువులు, రసములు వీనితో జేయబడిన అనగా స్వర్ణరజతతామ్రాదిధాతువులు అభ్రకము వైక్రాంతము తాళకము మున్నగు మహారసోపరసములు, పాదరసము మున్నగువానితో జేయబడిన యౌషధము లెంత ప్రాతబడినను జెడక గుణము లధికమగుచుండును.

### పచ్చివిగనే యుపయోగించవలసినవి.

అడ్డసరము, బూడిదెగుమ్మడి, పిల్లిపీచర (శతావరి), తిప్పతీగె, గోరింట, తామరకాడలు, మాంసము, అల్లము, తామరగడ్డ, కొడిశపాల, పెన్నేరు.

### ఉపయోగించు క్రమము.

కొత్తగ తేబడి ఎండబెట్టబడిన మూలికలనే యుపయోగించవలెను. ఎండువి దొరకనియెడల పచ్చివి తెచ్చి ఎండినవాని భాగమునకు ద్విగుణముగ చేర్చి ఔషధమును సిద్ధము చేయవలెను.

[సంస్కరింపబడి, పెంపొందింపబడి ప్రచురింపబడిన రెండవకూర్పు 'వైద్యయోగరత్నావళి' నుండి గ్రహింపబడినది.]

గ్యారంటి ! 2 సంవత్సరముల గ్యారంటి !!

# టి. సి. ఎన్. గోల్డెన్ మెటల్ జ్యూయలరి

## మార్టువారి వివిధరకముల గాజులు




ఈ గాజులు అచ్చంగా బంగారు గాజులలాగే కాంతితోనూ, వన్నెలోనూ మెరిసిపోతున్నాయి. నలుపు కావడములేదు.



పెద్దసైజు గాజులు 2 ఇంచిలు మొదలు పైబడినది. జత 1-కి రూ. 3-0-0

మధ్యమసైజు $1\frac{3}{4}$ ఇంచి మొదలు 2 ఇంచిలకు లోగా వుండునది. జత 1-కి రూ. 2-8-0

బేబీసైజు $1\frac{3}{4}$ ఇంచికి లోబడినది. జత 1-కి రూ. 2-0-0

వి. పి. ఖర్చులు జత మొదలు 6 జతలువరకు రూ. 0—6—0

గాజులకు ఆర్డరు చేయువారు వుపయోగించెడు వారి గాజుల చుట్టుకొలతను ఇంకితో మార్కు చేసి పంపండి.

2 అణాల ఖరీదుల మా చక్కని బొమ్మలకేటలాగు ఉచితము.

వలయువారు :—

## టి. సి. నాగలింగప్ప అండు కంపెని,

280 వాల్‌టాక్సు రోడ్డు, పార్కుటవున్ పోస్టు, మదరాసు.

ఏజంట్లు:—(1) పటేలుస్టోర్సు, మ్యునిసిపల్ హైస్కూల్ రోడ్డు, బెజవాడ.

(2) మహమ్మద్ బసిరుద్దీను సాహెబ్, మెటల్ జ్యూయలరిషాప్, మెయిన్ రోడ్, నిడదవోలు (పశ్చిమగోదావరిజిల్లా.)

(3) జయభారతి వస్త్రాలయము, మెయిన్ రోడ్, ఏలూరు.

# కోటీశ్వరులైన కూటిపేదలు

రచయిత :

జి. వెంకటరావు, బి. ఏ.

ధనస్వామిపద్ధతి (Capitalist System) ప్రస్తుతయుగంలో తీవ్రవిరసనానికి పాలై ఉంది. కాని దానిలో ఒకసుగుణంమాత్రం లేకపోలేదు. మనిషి మేధావిఅయి పుడితే అతను ఎంతదరిద్రపరిస్థితులలో పుట్టిపెరిగినా, ఎంత మిత్రులులేనివాడయినా తన బుద్ధిబలం చేత లోకాన్ని చీల్చుకొని పైకి రాగలడు. నేడు ప్రపంచంలో ప్రఖ్యాతిగాంచివున్న కోటీశ్వరులైన వణిక్పుంగవుల పలువురిచరిత్రలు పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమౌతుంది.

ధనస్వామి పదం చెవినిపడ్డంతోనే మనకు మోటారురాజైన హెన్రీఫోర్డు, ఎలక్ట్రిసిటీ ప్రభువైన ఎడిసన్, చెప్పులరాజైన బేటా మనస్సుకు తట్టుతారు. నానాకష్టాలుపడి తాము అనంతమగు ధనమూ, అసదృశమగు కీర్తి సంపాధించుకోవడమేకాకుండా మానవ లోకపు సాముదాయకసుఖానికి కారణభూతమైన అనేకపరికరాల్ని సమకూర్చిన ఈ ధనస్వాముల చరిత్రలు చదవడానికి చాలా సొంపుగా వుంటాయి. ఇట్టివారిచరిత్రలు పెక్కు 'ఆంధ్రభూమి'లో గడ ప్రచురించివుంది. ఇక్కడ దిఙ్మాత్రంగా కొన్నిటినే ప్రస్తరిస్తాను.

### సర్ రాబర్టుమాక్ ఆల్పయిన్

సర్ రాబర్టుమాక్ ఆల్పయిన్ అనే కోటీశ్వరుడు ఇటీవలనే దివంగతుడయాడు. అతడు ఆదిలో ఇటుకలతో గోడలు మొదలైనవిపెట్టే తాపీపనివాడు. క్రమంగా అతను ప్రపంచంఅంతటికీ పేరుమోసిన భవననిర్మాత అయాడు. కాంక్రీటుతో భవనాలు నిర్మించే విధానానికి సృష్టికర్త ఆ మహాశయుడే. అతను తన ఇరవయ్యోయేటే తనరెక్కల మీద తాను బ్రతకడానికి ప్రారంభించాడు. భవననిర్మాణంలో అతను తీసుకున్న మొదటి కంట్రాక్టు ఒకానొకమిల్లుయొక్క పొగపోయే గొట్టంయొక్క మరామ్మతు అయివుంది. ఇంతకూ ఆకంట్రాక్టు రెండుపౌండుల తొమ్మిది షిల్లింగులకు. ఇట్లాంటి చిన్నకంట్రాక్టులతో చిరకాలం గొండాడితేకాని అతను పైకిరాలేదు. ఈ మొదటికంట్రాక్టు పూర్తిచేసిన ఏడేళ్ళకు పిమ్మట అతను ఇటుకలు తయారుచేసే రెండుకార్ఖానాలకు స్వానుదారుడు, వెయ్యిమంది పనివాళ్ళకు యజమాని అయాడు. క్రమంగా హామిల్టన్ పట్టణంలో కలిసిపోయిన బరన్ బ్యాంక్ అనే గ్రామంలోని విశేషభాగం అతనుకట్టిన గృహాలతోనే నిండాటివుంది. వాటి అన్నిటికీ అతనే స్వానుదారుడు. ఇట్లా ఉంటూవుండగా ఆర్థికంగా అతనికి ఓపెద్దదెబ్బ తగిలింది. అతని డిపాజిట్లువున్న ఒకబ్యాంకు దివాలాతీసింది. అందుతో అతను చేత పైసాలేనివాడయాడు. అయినా అతను నిరుత్సాహపడలేదు, కుంగిపోలేదు. తిరిగి తనవ్యాపారాన్ని పూర్వస్థితికి తీసుకురావడానికి పూనుకున్నాడు. ఈబ్యాంకు దివాలాజరిగిన ఎనిమిదేళ్ళకు పిమ్మట అతను డెబ్బయివేలపౌనుల వ్యయంతో లానార్క్ అండ్ అయిర్ రైల్వేలోని కొంతభాగాన్ని

నిర్మించడానికి కంట్రాక్టు తీసుకోగలిగేడు. అతను కంట్రాక్టుతీసుకొని నిర్మించిన భవనాల్లోకి అన్నిటిలోకి అతిప్రఖ్యాతమైంది వెంబ్లి ఎగ్జిబిషన్‌సందర్భంలోకట్టిన పాలెస్ ఆఫ్ ఇండస్ట్రీ భవనమున్నూ పాలెస్ ఆఫ్ ఎంజనీరింగు భవనమున్నూ అయివున్నవి. ఆ సందర్భంలోని అతని కంట్రాక్టుమొత్తం ముప్ఫయి అయిదులక్షలపౌనులు అయివుంది. అతను అనేకమైన ఫ్యాక్టరీల భవనాలని నిర్మించి వున్నాడు. క్లైడ్ బాంకులోని సింగర్‌వర్క్సు వారి ఫ్యాక్టరీభవనమున్నూ, హడ్డర్సుఫీల్డులోని బ్రిటీష్ డై లిమిటెడ్‌వారి ఫ్యాక్టరీ భవనమున్నూ మాక్‌ఆల్పయిన్ కట్టినవే.

### విలియమ్ మారిస్

ఇప్పుడు లార్డునఫ్ఫీల్డు అయివున్న విలియమ్ మారిస్ — మారిస్‌కార్ల యజమాని — అభివృద్ధికూడ ఆల్పయిన్ అభివృద్ధివలె అద్భుతావహమైనదే. నేడు అతని కారులు అతిలోక ప్రఖ్యాతి కాంచివున్నవి. కాని ఐరోపామహాసంగ్రామానికి పూర్వం అతను ఆక్సుఫర్డుచెంత ఒక సైకిలుషాపు పెట్టుకుని వుండేవాడు. అప్పుడు అతనివ్యాపారం అపహాసపాత్రంగావుండేది కాని ఇంత విజయవంతంగా వుండేదికాదు. ఐనా అప్పటినుంచీ కూడా అతను మిక్కిలి ఓపికతో మోటార్‌డిజైన్ గూర్చి యోజిస్తూనేవున్నాడు. అప్పటి మోటారుపరిశ్రమ ఇంతగా విజృంభించివుండలేదు. కాని మారిస్‌కారుడిజైన్ చాలా బాగావుంది. వస్తువిక్రయంలో అతిలోకప్రజ్ఞఉన్న గార్డాన్‌స్టూవార్టు అనేవాడు ఈ విషయాన్ని కనిపెట్టి మారిస్ కారుల విక్రయానికి దొరకొన్నాడు. ఈనాడు లార్డునఫ్ఫీల్డుకు ఇంగ్లండులో కార్లునిర్మించే యంత్రాగారాల్లో బ్రహ్మాండమైన యంత్రాగారం వుంది. మోటారుకారుల విక్రయంకొరకు ఏజన్సీతీసుకున్న స్టూవార్టు వ్యాపారం విశేషంగా విస్తరింపచేసి స్టూవార్టు అండ్ ఆర్డన్ అనేపేరుతో గొప్ప మోటారువ్యాపారశాలకు నిర్మాతఅయాడు.

### లార్డు హర్‌స్టు

కోటీశ్వరులైన కూటిపేదలకోటికి చెందిన లార్డు హర్‌స్టుచరిత్రకూడ ఇట్లే చమత్కారంగావుంటుంది. మ్యూనిచ్‌నుంచి అతను మొదట మ్యాన్చెస్టరు వచ్చినపుడు అతన్ని చూసినవాడు ఎవడు కాని అతడు అనంతర కాలంలో కోటీశ్వరుడు అవుతాడని అనుకోడానికి అవకాశం ఏమాత్రం లేకుండావుండేది. మ్యాన్చెస్టరులో అతడు ఒకచిన్న ఇంజనీరింగు శాలను స్థాపించాడు. అది కొద్దిరోజుల్లోనే మంచిమార్గంలో పడింది. చేతిలో నాలుగు పైసాలుచేరడం ప్రారంభించినతోడనే అతను తన కార్యస్థానాన్ని లండను మహానగరానికి మార్చేడు. నగరమధ్యంలో ఎలక్ట్రిక్‌షాపు పెట్టేడు. ఏడాదిఏడాదికి అతని చిన్నవ్యాపారం గోగుకామలాగు పెరుగుతూనేవచ్చింది. ఈ ఇరవయ్యోశతాబ్దిలో ఎలక్ట్రిసిటీకి, దానికి సంబంధించిన పరికరాలకి ఎంతటి ప్రాముఖ్యం వస్తుందో అతను సూక్ష్మబుద్ధితో గ్రహించాడు. ఇంట్లో దీపాలదగ్గరనుంచి పరిశ్రమల్లో సమస్తమగుపనులు నిర్వర్తించడానికి ఎలక్ట్రిసిటీ కావలసివస్తుందని అతను ఆకళించాడు. ఈనాడు అతను జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ (లిమిటెడ్) నకు అధ్యక్షుమహాశయుడు. భాగ్యవంతమైన లండన్ మహానగరంలో భాగ్యశాలులైన పౌరుల్లోను, పలుకుబడిగల పౌరుల్లోను అగ్రశ్రేణికి చెందినవారిలో అతను ఒకడై ఉన్నాడు. అతని కీర్తి బావుటా ఇతరక్షేత్రాల్లోకూడా బాగా రెప

రేపలాడుతూవుంది. గుఱ్ఱపుపందెములలో కూడా అతనిప్రవేశం జయవంతమే అయివుంది. డైయోలైట్ అనేపేరుగల అతని గుఱ్ఱం 1930 లో డెర్బీపందెములలో మూడోదిగా లెక్కకువచ్చింది.

### జేమ్సుమారిసన్

తనకాలంలో జేమ్సుమారిసన్ అనే కోటీశ్వరుడుకూడా మంచి ప్రఖ్యాతిపొందివుండినాడు. ధనస్వాములకు యాత్రాస్థలంగా విలసిల్లుతూవున్న లండన్ మహానగరానికి హాంప్‌షైర్‌నుండి అతను పొట్ట చేతపట్టుకుని వచ్చేడు. ఒకానొక బట్టలవర్తకునివద్ద అసిస్టెంటుగా చేరాడు. క్రమంగా అతను సొంతవ్యాపారం ప్రారంభించి మళిగవ్యాపారంలో స్థిరపడి గిడ్డంగులు స్థాపించాడు. చనిపోయేసరికి అతను నలభై లక్షలపౌనులు ఆర్జించాడు. తాను ఆర్జించడమేకాదు. తన కొడుక్కి కూడా ఆర్జించడానికి మార్గంచూపించాడు. అతనికొడుకు ఛార్లెస్ చనిపోయేసరికి నూటపదిలక్షలపౌనులు ఆర్జించాడు.

### బర్నార్డుభారన్

సిగరెట్లవ్యాపారంచేసి కోటీశ్వరుడై ఇటీవల కీర్తిశేషుడయిన బర్నార్డుభారన్ మిక్కిలితక్కువస్థితిలోనుంచి పైకివచ్చేడు. స్వయంకృషివల్ల పైకివచ్చిన పలువురికిలాగే అతనికి కూడా వ్యాపారవిషయంలో ఒక కిటుకు తోచింది. ఆకిటుకు మంచిదైనదయింది. అదే అతనికి లక్షలకొద్దీ ధనాన్ని కూర్చిపెట్టింది. యంత్రసహాయమున సిగరెట్టులు విరివిగా తయారుచేసి పెద్దస్కేలుమీద వానితో వ్యాపారం సాగించినవారికి భారన్ మార్గదర్శకుడు. యంత్రసహాయంతో సిగరెట్లు ఉత్పత్తిచేయడంవల్ల అతను ఇతరవస్తువులకంటె త్వరగాను విస్తారంగాను వానిని చేయగలిగేవాడు. అదిన్నీగాక యంత్రపద్ధతివల్ల శుచిత్వంకూడా లభ్యమయ్యేది. భారన్ సిగరెట్ల చెలామణీకి శుచిత్వం ఒక మంచికారణంఅయింది. అయినా మొదట్లో ఇతరసిగరెట్టువర్తకులు దీనిని గమనించలేదు. భారన్ రాకవల్ల తమవర్తకానికి ఏమీ నష్టంవుండదని భావించారు. కాని క్రమంగా యంత్రంవల్ల తయారైన సిగరెట్లనే అందరూ కొనడానికి ప్రారంభించారు. లండన్‌లోని బ్రహ్మాండమగు అతనిఫ్యాక్టరీ అతని కార్యదీక్షకు, నిరంతరపరిశ్రమకు మొక్కవోని నిదర్శనమై వున్నది. కొన్నికొన్ని ధర్మసంస్థలకు అతను విరివిగా విరాళాలిచ్చినాడు. గౌరవాలకోసం, బిరుదులకోసం అతనెప్పుడూ ఆశించలేదు. 1930 లో అతనికొడుక్కి బారొనెట్సీ యివ్వబడింది.

### సర్ థామస్ ఆల్వా ఎడిసన్

ఎలక్ట్రిక్ లైట్లు, గ్రామఫోనులు, టెలిఫోనులు మొదలయినవి కనుగొని వాని మూలమున అపారధనసంపత్తిని ఆర్జించిన థామస్ ఆల్వాఎడిసన్ చరిత్రకూడా ఇట్టి అద్భుతావహమైనదే. నూతనపరిశోధనల్ని జరిపి కొత్తవిషయాలు కనుక్కొనే మేధావులకు వ్యాపారపరిజ్ఞానం ఉండదనీ, వారి మేధాశక్తిచే కనుగొనబడిన విషయాలవల్ల లభించే ధనమంతా ఇతరులచేతుల్లోకి పోతుందనీ చాలామంది నమ్మకం. ఇది కొందరి విషయంలో నిజమైతే కావచ్చుకాని థామస్ ఆల్వా ఎడిసన్ విషయంలో మాత్రం నిజంకాదని చెప్పితీరాలి. తనపరిశోధనలు ఆర్జించిన ధనరాశి తాను పొందగలిగేటంత పెద్దకాలంవరకూ అతను జీవించివున్నాడు. నేటి నాగరికత ఎరిగిన పెక్కుసౌకర్యములకు అతని అద్భుతమైన మేధస్సే పంటపొలము. ఆల్వాఎడిసన్

పరిశోధనలవల్ల ఎలక్ట్రిక్ దీపాలలోనిబల్బు నేడు మనకు తెలిసివున్న పద్ధతిది సమగ్రమైంది. మానవుని కంఠస్వరాన్ని ప్రతిధ్వనించిన మొదటియంత్రం అతను కనుగొన్నదే. ఎడిసన్ పరిశోధనకు ఫలముగానే నేడుమనం దివంగతులైన సర్ హెర్బర్టుట్రీయొక్క వాగ్ధాటిని, కారుశోమహాశయుని మధుర గానాన్ని వినగలుగుతున్నాం. అతని పరిశోధనలన్నిటిలోనికి మానవజీవితవిధానంలో హెచ్చు పరివర్తనాన్ని తీసుకువచ్చింది టెలిఫోను. టెలిఫోనులేనిదే ఆధునికవ్యాపారమే లేదనవచ్చు. టెలిఫోనులమూలముగా వర్తకులకు కూడివచ్చుచున్న కాలంవలని లాభమంతా ఎడిసన్ పరిశోధనకు ఫలమే. వీటిని గూర్చి పరిశోధనలుసాగించే తొలిదినాల్లో ఎడిసన్ ఇవి తన సంపాదనవిషయంలో కాని నేటి నాగరికప్రపంచంయొక్క వ్యాపారవ్యవస్థలో కాని అద్భుతమైన పరివర్తనాన్ని కొనివస్తాయని కలనైనా తలచి యెరగడు.

## హెన్రీ ఫోర్డు

కోటీశ్వరులయిన కూటి పేదల్ని తలచే ఈ సందర్భంలోనే ఎడిసన్ ఇల్యూమినేటింగు కంపెనీతో సంబంధంగల మహోవ్యక్తినిగూర్చి కూడా చెప్పవలసివుంది. అతనుకూడా ఎడిసన్‌లాగే స్వయంకృషివల్లనే పైకివచ్చేడు. కొంతకాలం అతను ఆకంపెనీలో ఛీఫ్ ఇంజనీరుగావుండినాడు. అతనిపేరు హెన్రీఫోర్డు. ఫోర్డు గొప్ప విద్యావంతుడుకాడు. అయినా అతని యువకహృదయంలో ఒక వ్యాపార మర్మం జాగరితమౌతూవుండినది. దాన్నిఎట్లా అయినా ఆచరణలో పెట్టాలని అతనిపట్టు. అప్పటి మోటారులవెల చాలా ఎక్కువగా వుండివుండెను. కాబట్టే అవి ప్రజాబాహుళ్యానికి అందుబాటులోనికి రాలేదు. మోటారుకారును అందరి అందుబాటులోకి ఏల తీసుకొనిరాకూడదు ? ఇల్లా తీసుకురావడానికి ఇంజనీరింగుకౌశల్యం ఒక్కటేకాకుండా ఆర్గనైజేషన్ సామర్థ్యంకూడా అనంతంగా వుండాలనే నిజం అతను తెలుసుకున్నాడు. కార్లని విస్తారంగా ఉత్పత్తిచేయడానికి నొరకొంటే వానియొక్కచేతకూలి బాగా తగ్గుతుందనే రహస్యం అతనికి మొదటినుంచీ తెలుసు. కాబట్టి ఆపద్ధతిలో అతను కార్లను తయారుచేయడానికి పూనుకున్నాడు. అచిరకాలంలోనే అవి విశేషప్రచారానికి వచ్చి తమకు జన్మమిచ్చిన ఫోర్డునామంతోనే వ్యవహరింపబడుతూ ప్రపంచప్రఖ్యాతము లయినాయి. ఫోర్డు అపారధనసంపత్తిని అర్జించాడు. అతని స్వదేశంలోను, ఇతరచోట్లకూడా అతను గొప్ప పలుకుబడి కలిగిఉన్నాడు. డెట్రాయిట్‌కు చెందిన డియర్‌బారన్ పట్టణమంతా అతను నిర్మింపచేసిందే. అందులోని ఇళ్ళల్లో నివశించేవారంతా అతని పనివాళ్లే. ఆఊరికి ప్రత్యేకం ఒక దినపత్రికవుంది. దానిపేరు 'డియర్‌బారన్ ఇండిపెండెంటు.' దానికి స్థానికంగామాత్రమే కాకుండా అమెరికాసంయుక్తరాష్ట్రమంతా పాఠకులుఉన్నారు. అతను 1915-వ సంవత్సరంలో యుద్ధాన్ని ముగింపచేసి శాంతికలిగించడానికి చాలా ప్రయత్నించాడు. అతని ప్రయత్నాలు ఫలదముట్టలేదే అనుకోండి. అయినా ధనస్వాములగు పరిశ్రామికులు యుద్ధనిరోధంకోసం చేసిన ప్రబలప్రయత్నాలకి ఇదో నిదర్శనంగా వుండగలదు.

ఈవ్యాసంలో ప్రస్తావింపబడిన కోటీశ్వరులందరూ ఆదిలో కూటిపేదలే. స్వయంకృషియొక్క అద్భుతశక్తిని గుర్తెరిగిన వారికి ధైర్యోత్సాహములు కలిగించుటకుగాను వీరిచరిత్రలు దివ్యజ[illegible]ల్లయి ఉంటాయి.

# సర్పాలికి ప్రత్యేకింపబడిన స్వర్గం

జపాన్ చెంతగల కొరియాదేశతీరాన్ని ఒక చిన్నద్వీపంఉంది. ఆద్వీపంనిండా పాములే. మనిషి నిలబడ్డానికే ఆస్కారంవుండదు. లైట్‌హౌస్ కట్టడానికి అది ఎంతేనా అనుకూలప్రదేశం. కాని దానిమీద నివసించే సర్పాలమూలాన్ని లైట్‌హౌస్ కట్టే ప్రయత్నాల్ని జపానువారు మానుకున్నారు. ఆ చిన్నద్వీపంమీద ఐదులక్షల పాములు నివశిస్తున్నాయని లెక్క వేయబడ్డది. ఆద్వీపం చీనాప్రభుత్వానికి చెందిన క్వాంటంగ్ రాష్ట్రంలోది. రష్యాజపాన్ యుద్ధం అయిన తరవాత జపానువారు దానిని చీనావారినుండి తొంభై తొమ్మిది సంవత్సరాలికి కవులుకు తీసుకొన్నారు. దాన్ని 'స్మాల్ డ్రాగన్ మౌంటెన్ ఐలెండు' అంటారు. పిఛిలీగల్ఫు ముఖద్వారంలో పిఛిలీరాష్ట్రపుపడమటికొసను అది ఎనిమిదిమైళ్ళ దూరంలోవుంది. 1931 వ సంవత్సరంలో మంచూరియాయొక్క ఖనిజసంపదను పరిశోధించడానికి జపాన్‌వారు శాస్త్రవేత్తలను పంపారు. ఆద్వీపాన్నిగూర్చికూడా విచారణసలపవలసిందిగా ఆశాస్త్రవేత్తల్ని కోరారు. ఆద్వీపంనిండా పాములుఉన్నాయనీ, అచట లైట్‌హౌస్ కట్టడానికి ఏమన్నా వీలు ఉందేమో చూడవలసిందనీ శాస్త్రవేత్తల్ని జపాన్‌వారు కోరారు. పరిశోధించి ఆశాస్త్రవేత్తలు ఆద్వీపం సర్పాలికి స్వర్గంగావుందని తేల్చారు. అచటి సర్పాలు ప్రత్యేకమైనజాతివి. అల్లాంటివి జపాన్‌లో మరోచోట ఎచ్చటా లేవు. మనుష్యుల్ని ఎదుర్కోడానికి వాటికి నిండాభయం. ఆద్వీపంఅంతా వాటితో నిండారి ఉండడంచేత సర్పసందర్శనం కాకుండా మానవుడు అచ్చట నాలుగు అడుగులేనానడవలేడు. పంగలకర్రగనకవుంటే వాటిని పట్టుకోవడం అతిసులభం. మంచూరియాదేశాన్నుంచి ప్రతికూలమైన ఋతువుల్లో ఇతర దేశాలకి వలసపొయ్యేపక్షులయొక్క మార్గంలో ఆద్వీపంవుంది. అట్లా వలసపొయ్యేటప్పుడు విశ్రాంతిమార్గం ఆ పక్షులు ఆద్వీపంమీది తుప్పలమీద వాల్తాయి. అల్లాంటప్పుడు ఆపాములు ఆపక్షుల్ని పట్టి తినేస్తాయి. చెట్టుకొమ్మలకు పాములు చుట్టపెట్టుకుని నక్కివుంటాయి. పక్షులువచ్చి రావడముతో వానినిపట్టేసి భక్షిస్తాయి. ఆహారంగా ఈపక్షులు దొరకని రోజుల్లో ఆపాములు ఆద్వీపంమీద అడివిగా పెరిగే సోయాబీన్సు, మొక్కజొన్న, యారోరూట్ మొదలైనవి తింటాయి. ఆశాస్త్రవేత్తల్లో ఒకడు ఆ పాముల చలనచిత్రాల్ని తీస్తూవుండగా మరిఒక శాస్త్రవేత్త ఆద్వీపంమీద ఉన్న తుప్పల్ని ఒక్కసారిగా కాల్చేస్తే అచటి సర్పాలు సమూలంగా నాశనమౌతాయని సూచించాడు. కాని ఆసూచన అంగీకరింపబడలేదు. ఏమంటే సర్పం చీనావారికి జాతీయచిహ్నం. జాతీయచిహ్నంతో వీటికి పవిత్రమైన సంబంధం ఏర్పడివుండడంచేత వీని నాశనానికి చీనాప్రభుత్వం అంగీకరించలేదు. అదీకాక ఆసర్పాలతో చీనావారు కొన్నిమందుల్ని చేస్తారు. అంతటి ఉపయోగకరమైన జంతువుల్ని నాశనంచెయ్యడం నష్టదాయకమనీ, అందులో సులభంగా దొరికిపోయేవాటిని చంపడం ధర్మవిరుద్ధమనీ నిశ్చయించి ఆపరిశోధకులు ఆద్వీపాన్ని ఆసర్పాలికి శాశ్వతస్వర్గంగా ప్రత్యేకించవలసిందిగా సిఫారసు చేశారు.

THE SOUTH INDIA CO-OPERATIVE INSURANCE SOCIETY, LTD.,

MADRAS.

# ది సౌత్ ఇండియా కో-ఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ, లిమిటెడ్.

హెడ్డాఫీసు : మద్రాసు. పోస్టుబాక్సు నెం : 182.

(1) సహకారధర్మములమీద స్థాపింపబడినది.
(2) రాజధానిలోని ప్రసిద్ధ సహకారనాయకులచే నడపబడుచున్నది.
(3) రు 100 లు మొదలు రు 5000 లు వరకు పాలసీలు జారీచేయబడును.
(4) పాలసీదారులే వాటాదారులు.
(5) ప్రీమియము రేట్లు చాల తక్కువ.
(6) ప్రీమియములను రాజధానిలోని కోఆపరేటివు బ్యాంకులలో చెల్లింపవచ్చును.
(7) ఆటోమాటిక్ నాన్ ఫర్ ఫీచరు సౌకర్యముగలదు.
(8) స్త్రీజీవితభీమా యంగీకరింపబడును.

వివరములకు హెడ్డాఫీసునకుగాని, యీ క్రింది ఆర్గనైజర్లకుగాని ఏజంట్లకుగాని వ్రాసి తెలిసికొనవచ్చును.

గంజాం ... డి. కృష్ణమూర్తిగారు, ఆర్గనైజరు, మిలిటరీలైన్సు, బరంపురం.
విశాఖపట్టణం ... ఎ. వీరరాజుగారు, మానేజరు, విజయనగరం కోఆపరేటివు సెంట్రలుబ్యాంకి, విశాఖపట్టణం బ్రాంచి, విశాఖపట్టణం.
తూర్పుగోదావరి... పాణంగిపల్లి సత్యనారాయణగారు, ఇన్స్పెక్టరు, రామచంద్రపురం.
పశ్చిమగోదావరి... టి. కుటుంబశాస్త్రిగారు, ఆర్గనైజరు, నిడదవోలు.
కృష్ణా ... జి. రాఘవశర్మగారు, ఛీఫ్ ఏజంటు, గుడ్లవల్లేరు.
నెల్లూరు ... ఎ. సుబ్రహ్మణ్యంగారు, ఆర్గనైజరు. 1250. యం. వి. అగ్రహారం, నెల్లూరు.
అనంతపురం ... ఎ. నారాయణప్పగారు, ఛీఫ్ ఏజంటు, అనంతపురం.
బళ్లారి ... యస్. ఆర్. సుబ్రహ్మణ్యముగారు, జిల్లాఆర్గనైజర్, హాస్పేట.



నేషనల్ మూవీటోన్ వారి 'పార్వతీకల్యాణము' ఫిలుములోని
రతీమన్మథులు



సరస్వతీటాకీస్ వారి 'కనకతార'లో నటించుచున్న
బసవయ్యశాస్త్రి, బి. ఏ;—పి. కన్నాంబ.

# ప్రవరుఁడు : పెద్దన్న

తాను సృష్టించు పాత్రలలో కవి ఒక్కొక్క పాత్రను అభిమానపాత్రగా చేకొను నను అనుభవజ్ఞులకు పునరుక్తము. అట్లు చేకొనిన అభిమానపాత్రకు కవి ప్రయత్నముగనో అప్రయత్నముగనో స్వీయగుణములను అన్నిటినో కొన్నిటినో అంకిత మొనర్చు ట అరుదు కాదు. ఆంగ్లనాటకకవి [illegible] పియరు తన 'టెంపెస్టు' రూప[illegible] స్పెరో' పాత్రమున ఆత్మజీవిత[illegible] అనువుపఱచియున్నాడు. అట్లే మనుచరిత్ర మున అల్లసాని పెద్దన్న ప్రవరుని గుణవర్ణన మున స్వీయగుణముల కొన్నిటిని పొసగించె నని విమర్శదృష్టితో ఆప్రబంధమును పఠించు వారికి తోపకమానదు.

మారనదుకాదు. తప్పక తోచును. ప్రవరునికథ వర్ణించు ఘట్టములే మనుచరిత్రమున రసకందాయములు. మిగిలిన ఘట్టములందు అట్టిరుచి లేదు. ప్రవరుడు తన అభిమాన పాత్రగావుననే పెద్దన్న ప్రవరుని కథ పట్టులను మనోహరముగ వర్ణించి విశేషరుచి చూపకల్గినాడు.

మారన మార్కండేయపురాణమునందలి స్వారోచిషమనుజన్మవృత్తాంతమును మూలముగాకొని పెద్దన్న మనుచరిత్ర రచియించెను. మార్కండేయపురాణమున

క. వరుణాతటినీ తటమున
  వరుణాస్పదమను పురంబునం దతులగుణో
  త్తరుఁడు గలఁడొక్కధరణీ
  సురవరుఁ డశ్వినులకంటె సుందరుఁ డెందున్.

చ. అతిసుకుమారమూర్తి ప్రవ
  రాఖ్యుఁ డుదాత్తుఁడు వేదపారగుం
  డతిథిజనార్చనాభిరతుఁడై చరియించు
  చు శైలకాననాం
  చిత సకలావనీతలవిశేషము లెల్లను
  బ్రీతిఁగన్గొనన్ మతిఁ గడుం గోరుచుండ...

అని ప్రవరుఁడు అభివర్ణింపబడెను. అట్లగుట మారనవర్ణించిన ప్రవరుఁడు 1. సుందరసుకుమారమూర్తి. 2. ఉదాత్తుఁడు; అతులగుణోత్తరుఁడు. 3. వేదపారగుఁడు; 4. అతిథిజనార్చనాభిరతుఁడు. 5. సకలావనీతలవిశేషముల చూడగోరువాఁడు. 6. ధరణీసురవరుఁడు.

పెద్దన్న వర్ణించిన ప్రవరుఁడు. 1. మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి; అలేఖ్య తనూవిలాసుఁడు. 2. భాషాపరశేషభోగి. 3. వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీక్షాపరతంత్రుఁడు. 4. అంబురుహగర్భకులాభరణము. 5. అనారతాధ్యాపన తత్పరుండు. 6. విషయేచ్ఛ లేనివాడు. 7. గురుజనభక్తిగలవాడు. 8. శిష్యులను జేరదీసి విద్యగఱపువాఁడు. 9. నిర్దోషమైన సాలగ్రామదానము సయితము గ్రహింపని రాజసగుణము కలవాడు. 10. ఒకప్పుడును ఇంటియందు పాఁడియుపంటయు తఱుగని ధనాఢ్యుడు. 11. అభ్యాగత సకలసేవా పరతంత్ర సకలజీవనుడు. 12. 'వలయుభోజ్యంబు లింట నవ్వారిగాఁ' గూర్చి మార్గస్థులకు సర్వకాలములందు అన్నదానమొనగూర్చువాడు. 13. తీర్థసందర్శనాభిలాషి.

ఈరెండువర్ణములు పోల్చి చూచితిమేని 1. బ్రాహ్మణవంశము. 2. సౌందర్యము. 3. వేదాధ్యయనము. 4. అతిథిజనార్చనాభిరతి. 5. తీర్థ సందర్శనాభిలాష. 6. విషయేచ్ఛ మొదలగు తుచ్ఛగుణములులేని ఉదాత్తత; అను ఆరుధర్మములును మారన పెద్దన లిరువురు సమానముగ ప్రవరునియందారోపించిరని తేటతెల్లమగును. 1. శిష్యశిక్షణము,

2. రాజసగుణము. 3. ధనాఢ్యత. 4. భాషాపరశేషభోగిత్వము. 5. దానవిరతి. 6. గురుజనభక్తి అనునవి పెద్దన్న ప్రవరునియందు క్రొత్తగా అంకితమొనర్చిన విశేషగుణములు.

సౌందర్యము, వైరాగ్యము, అతిథిసేవానిరతి, తీర్థసందర్శనాభిలాష మున్నగు ప్రవరుని గుణములు ఉత్తరకథావిస్తృతికి మూలబీజములు. పెద్దన్న క్రొత్తగా ఆరోపించిన శిష్యశిక్షణము, రాజసగుణము, ధనాఢ్యత, భాషాపరశేషభోగిత్వము మున్నగు అతని గుణములు తరువాతికథను పెంపొందించుటకెట్లును సహకారులుగావు. కాకపోవుటతో సరిపోయినదా? అవి కథాసారస్యమునుగూడ చెడగొట్టుటకు తోడ్పడినవి. ఎట్లందురా? భాషాపరశేషభోగియైన ప్రవరుడు వరూథిని కామశాస్త్రోపన్యాసమునకు వాయెత్తలేకపోవుట యొక గొప్పలోపము.

అయితే ఒకప్రశ్న. ఉత్తరకథావిస్తృతికి ఉపయోగపడకుండుటయేగాక కథాసారస్యమును కూడ చెడగొట్టుటకు తోడ్పడిన ఈ క్రొత్తగుణములు ప్రవరునియందు పెద్దన్న ఏల ఆరోపించెను? దీని క్కొటే జవాబు. తానభిమానపాత్రముగాఁ జేకొనిన ప్రవరునియందు స్వీయగుణములుకొన్నిటిని హత్తించ పెద్దన్న ముచ్చటపడినాడు. అవి కథాసారస్యమును ఒక్కింత డిందుపాటు నొందించుననుభయముకాని, ఉత్తరకథావిస్తృతికి సహకారము కావనుచింతకాని అట్టి ముచ్చటలో ఆతనికి తట్టనేలేదు.

పెద్దన్న ప్రవరునియందు నూతనముగ ఆరోపించిన శిష్యశిక్షణము, రాజసగుణము, ధనాఢ్యత, భాషాపరశేషభోగిత్వము, దాననిరతి, గురుజనభక్తి అను గుణములు ఆంధ్రకవితాపితామహుని [illegible]గుణములని మనమిక నిర్ధారణ చేయవలసి యున్నది. అందులకాతని జీవితచరిత్రమునుండి నిదర్శనములను ఎత్తి పరిశీలింతము.

౧. శిష్యశిక్షణము

వేదవేదాంగములయందు అనంత కౌశలము గడించిన కోవిదుడగుటచే ప్రవరుడు శిష్యులను చేరదీసి వారికి విద్యాబుద్ధులగఱ[illegible]ను. శిష్యులయందు ప్రవరునకు వాత్సల్య[illegible] తాను వరుణానదికి స్నానమునకు [illegible]యితము వారిని వెంటబెట్టు[illegible]. శిష్యులతో నింత అరమరలు లేకయుండిన గురువు కావుననే ప్రవరుడు హిమాలయపర్వతమున 'మిన్నులువడ్డచోట' నుండి పోయినప్పుడు

> 'కడఁదోడుసీడలై క్రీడించు సచ్ఛాత్రు
> లంతకు నెంత చింతింతురొక్కొ'

అని (తల్లిని, తండ్రిని, భార్యనుగూర్చి చింతించిన నోటితో) శిష్యులగూర్చికూడ చింతించినాడు. పెద్దన్నయు తాను ఆంధ్రకవితాపితామహుఁడు గావున కొంతమంది యువకులకు కవితాశిక్ష యొసంగినాడు. ఇందుకు నిదర్శనములు చూపవచ్చును. భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరనలు కవిత్వమున ప్రథమపాఠములు పెద్దన్నయొద్దనే చదివిరనుటకు కథలుగలవు. భట్టుమూర్తి పెద్దన్న శిష్యుడను కథను వసుమనుచరిత్రల రచనాసాదృశ్యము కొంత పోషింపకపోదు. రామకృష్ణుడు ఆంధ్రకవితాపితామహుని శిష్యుడను కథకు

> క. కవి యల్లసాని పెద్దన
> కవి తిక్కన సోమయాజి గణుతింపంగాఁ
> గవి నేను రామకృష్ణుఁడఁ
> గవియను నామంబు నీరుకాకికి లేదే?

అను రామకృష్ణుని చాటుపద్యము జీవము పోయుచున్నది. గురువును అమితపూజ్యభావ

ముతో చూచు శిష్యునివలెనే ఈపద్యమున రామకృష్ణుడు తన్ను ఎంతయో కొంచెపఱచుకొని పెద్దన్నకు కవిబ్రహ్మయగు తిక్కనతో సమానస్థాన మిచ్చియున్నాడు. ఇక పింగళి సూరనవిషయము. ఆతడు పెద్దన్నకు మనుమరాలి పెనిమిటికదా! ఆతడు పెద్దనార్యుని శిష్యుడై యుండుటకు అవకాశము కలదని ఈ చుట్టరికము సూచించుచున్నది. పింగళి సూరన, భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుడును అష్టదిగ్గజములలోనివారని బలవత్తరమైన జనశ్రుతి చాటుచున్నను వారు కృష్ణరాయల కాలమున గ్రంథములేవియు రచియించియుండలేదు. రాయల మరణానంతరము కొలదికాలముననే వారు గ్రంథరచనకు దొడగిరి. ఇట్లగుటచే వారు రాయలకాలమున పిన్నలై పెద్దనయొద్ద గురుశుశ్రూష చేయుచు 'భువనవిజయము'నందు ప్రాజ్ఞులతో నిరంతరగోష్ఠి, కవిత్వమున జిజ్ఞాసయొనర్చి అనుభవజ్ఞులై నపిదప గ్రంథముల రచించిరనుట కెడమెంతేని గలదు.

### ౨. రాజసగుణము

తన యోగ్యతనుచూచి రాజులు నిర్దోషమైన సాలగ్రామదానమును ఈయవచ్చినను ప్రవరుఁడు తీసికొనఁడు. ఇది ఆతని రాజసగుణమును చాటుచున్నది. మహారాజులిచ్చిన మాన్యక్షేత్రములు కుటుంబపోషణమున కాధారమగుట ఆతనికి సమ్మతమే. కాని అట్టి రాజులే గౌరవించిఇచ్చు నిర్దోషమైన సాలగ్రామదానపరిగ్రహణమునకు ఆతని రాజసగుణము అడ్డుతగిలినది. ప్రవరునివలె పెద్దన్నయు రాజసుఁడే. తనకు ఆంధ్రకవితాపితామహుఁడన్న బిరుదమిచ్చి అష్టదిగ్గజములలో శ్రేష్ఠత్వమొసగి ఆదరాతిశయముతో గౌరవించిన కృష్ణదేవరాయ లొకప్పుడు ఏదేని కృతి రచింపుమని కోరఁగా రాజసగుణము గల పెద్దన్న

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియ
దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన
ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల
లేఖకపాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్ రచి
యింపుమటన్న శక్యమే.

అని నిశ్శంకముగ నిరాకరించెను.

### ౩. ధనాఢ్యత

ప్రవరుఁడు 'ధనాఢ్యుఁడు'. ఆతని మాన్యపుభూములు 'పెక్కు చందాలన్ పండు'చుండును. కావున ప్రవరునిఇంట పాఁడిపంటలు ఎల్లప్పుడును కొల్లలుగానుండును. మఱి యిక పెద్దన్న ధనాఢ్యత మనము విచారింప నవసరము లేదు. విజయనగరసామ్రాజ్యనియంతయైన కృష్ణదేవరాయలకు పెద్దన్న 'హితుఁడు.' అట్లగుట రాయలవలన అనేకాగ్రహారములనుపొంది ఆతఁడు ధనాఢ్యుఁడై మహాభోగముల చూఱఁగొనినాడు. పైగా పెద్దన్న పరిపాలనాదక్షుడైన మాండలికుడు.

### ౪. భాషాపరశేషభోగిత్వము

ప్రవరుడు భాషాపరశేషభోగి. పెద్దనార్యుని భాషాపరశేషభోగిత్వమునకు మనుచరిత్ర యొక దర్పణము. మనుచరిత్ర కృత్యాదిని కృష్ణదేవరాయలు కవితాపితామహుని 'చతురవచోనిధి' అని పేర్కొనుచున్నాడు.

### ౫. దాననిరతి

ప్రవరునిదాననిరతి మెచ్చతగినది. దానతత్పరుఁడైన ఆతఁడు భోజనపదార్థములు కొల్లలుగ తెచ్చి ఇంటియందుంచును. ఎంత మంది వచ్చినను, ఎప్పుడు వచ్చినను విసుగు

విరామములు లేక అతిథులకు అమర్చిపెట్టి అతని సహధర్మచారిణి అన్నపూర్ణను దలపించుచుండును. పెద్దన్న దాననిరతి వెల్లడించుటకు బలవత్తరమైన నిదర్శన మొకటి కలదు. తాను కృష్ణరాయలవలన పొందిన కోకటమను అగ్రహారమున కాతఁడు శఠకోపపురమని ఆత్మగురుడగు శఠకోపయతి పేరుపెట్టి విప్రులకు సర్వాగ్రహారముగా దానముచేసెను. ఇదికాక అతఁడనేక దేవాలయములకు భూదానములు చేసినట్లు నిదర్శనములు కలవు.

### ౬. గురుజనభక్తి.

ప్రవరుడు యజ్ఞమొనర్చి నలుగురిలో గౌరవప్రపత్తులు సంపాదించెను. అయినను ఆతఁడు ఇంటిపెత్తనమును స్వీకరింపలేదు. 'పార్వతీపరమేశ్వరులవలెనున్న' తన తల్లిదండ్రులనిన ఆతనికి అమితమగు భక్తి. అట్లగుట గృహకృత్యవిచారణ తలిదండ్రులకు వదలి ప్రవరుఁడు వారి యాజ్ఞకు బద్ధుఁడై యుండువాడు. గురుజనులయెడ భక్తి పెద్దన్న గుణములలో నొకటి. అతడు తాను రచించిన హరికథాసారమును ఆత్మగురువగు శఠకోపయతికి ఉపాయనముగ నర్పించెను. మఱియు నాతఁడు రాయలు తనకిచ్చిన కోకటమను అగ్రహారమునకు శఠకోపపురమని గురువు పేరిడి తన గురుజనభక్తిని లోకమునకు చాటినాఁడు.

ఇట్టి విశేషగుణములందు ప్రవరునకు పెద్దన్నకుఁగల సాదృశ్యము నిరూపించితిని. మారన పెద్దనలు ప్రవరునియందు సమానముగ ఆరోపించిన గుణములలో ప్రవరుని వేదాది గ్రంథాధ్యయనము ఆంధ్రకవితాపితామహునకు గల గుణములలో నొకటియని 'అతుల పురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుఁడు' అను రాయలవచనము సిద్ధాంత మొనర్చుచున్నది.

ప్రవరునకు, పెద్దన్నకుఁగల గుణసాదృశ్య నిరూపణమున ఆరువిషయములు చర్చించితిని. అందు శిష్యశిక్షణము, రాజసము అనుగుణములకు పెద్దన్న విషయములో నీయఁబడిన నిదర్శనములు కేవలము కథలపైన, చాటువులపైనమాత్రమే ఆధారపడియున్నమాట నిజము. ఇతర ఆంధ్రకవుల చరిత్రకువలెనే పెద్దన్న చరిత్రయు విస్మృతిగహనముపాలై యున్నది. అందువలన చరిత్రనిర్మాణమునకు కథలను, చాటువులను ఆశ్రయింపక తప్పదు. వానిని నిరాకరించితిమేని మనకున్న చారిత్రికాధారములు అత్యల్పము లగును. సత్యాంశలేశమైన లేకుండ ఇట్టికథలును, చాటువులును ప్రచారమునకు వచ్చుట పొసఁగనేరదనునమ్మకముతో వానిని నిదర్శనములుగ చేకొంటిని. ఇఁక మిగిలినవిషయముల సంగతి. అవి నిర్ధారించుట కీయబడిన నిదర్శనములు బలవత్తరములైనవే. కావున ప్రవరుని గుణవర్ణనము చేయుటలో పెద్దన్న స్వీయగుణములను కొన్నిటిని అనువుపఱచెనని చేయెత్తి చెప్పవచ్చును.



నేషనల్ మూవీటోన్ వారి 'పార్వతీకల్యాణము' ఫిలుములోని కల్యాణదృశ్యము.

# మధ్యాహ్నం ముద్దు

[చేసుకున్న పెళ్లాం : చేసుకోతలచిన పెళ్లాం.]

రచయిత :

తోలేటి గంగాధరము, ఎం. ఏ.

మానాన్న అన్నాడు తనకూ, మా అమ్మకూ నేను సరోజినీదేవిని పెళ్లాడ్డం చాలా ఇష్టంగావుంటుందని. సరోజిన్ని పెళ్లాడాలని ఆవరకే నాకు తలంపుకలిగివుంది. మాతల్లిదండ్రుల వుద్దేశంకూడా అదే అయినందుకు నాకు పట్టరాని సంతోషంకలిగింది.

సరోజిని మానాన్న చిన్ననాటి స్నేహితుని కూతురు. ఈమధ్యనే మాయింటికివచ్చి నెల రోజులపాటువుండి తిరిగి వెళ్ళింది. ఆమెసుగుణాలూ సత్ప్రవర్తనా చూచి మాయింట్లో అందరూ ఆమెని గాఢంగా అభిమానించడానికి ప్రారంభించారు.

నవనాగరికులయిన నేటి ఆడపిల్లల దగ్గర వుండే దుర్గుణాలేవీ ఆమెదగ్గర లేవు; ఆమె చాలావరకు పూర్వసాంప్రదాయాల్ని అభిమానించేదిగా కనిపించింది. ఆమెకు ఇంటిపనులూ, వంటపనులూ బాగా చేతఅవునని మాఅమ్మ సర్టిఫికెట్టుయిచ్చింది. బొద్దుగా అందంగా వుండేది. కాని ఆమెకు వల్లమాలినసిగ్గు. పైగా ముక్తసరిమనిషి, ఆమెలో నేను ప్రేమను రేకెత్తించగలనా అని ఒక్కొక్కప్పుడు సందేహంతోచేది. అయినా పెళ్లిఅయితే సిగ్గరితనం; ముభావంపోయి ఆమె అందరిలాగే కలిసికట్టుగావుంటుందని సమాధానం చెప్పుకుని తోచినసందేహాల్ని పూర్వపక్షం చేసుకున్నాను.

అందుచేతనే క్రిస్టమసుపండగలికి తిరిగి ఆమె మాయింటికి వచ్చినప్పుడు అందరమూ సంప్రదించుకోని మా వివాహదినం నిశ్చయం చేసుకున్నాం.

వివాహం నిశ్చయం అయిన తర్వాత కూడా సరోజని నాతో ముభావంగానే వుండేది. నేను ఏమాత్రం చనువు కలగచేసుకోవాలని చూసినా ఆమె బెదిరిపోయేది. సాధ్యమైనంత వరకు నన్ను తప్పించుకు తిరిగేది. పెళ్ళిఅనడంతోటే ఈ విచిత్రవర్తన అంతా పోతుంది అనే అనుకున్నానుకాని నాజీవితం నిండానిర్భాగ్యంఅయినది అవుతుందని అనుకోలేదు.

మానాన్న మదరాసులో పేరుమోసిన అడ్వొకేటు. మాక్రిస్టియన్లలో ఇంతప్రాక్టీసు, ఇంతడబ్బూ వున్న లాయరు మరోడులేడు. బియ్యేప్యాసై నేను మానాన్న ఆదేశంప్రకారం లాకాలేజీలోచేరి పట్టాపొందాను. మానాన్నతోబాటు నేనూ ప్రాక్టీసు మొదలుపెట్టాను. పెద్దతనంవల్ల ఇప్పుడు మానాన్న ఆరోగ్యం బాగావుండటంలేదు. కాబట్టి పని అంతా నామీదపడింది.

మానాన్న చాలా డబ్బుగడించాడని ఈ వరకే చెప్పివున్నాను. అతనికిగల పలుకుబడిన్నీ ఎక్కువయిందే. ఇల్లాంటి పరిస్థితుల్లో నాభావిజీవితం చాలాసుఖమయంగా వుండితీరుతుందని అనుకోడం గర్వం అనిపించుకోదు. నేను ఇప్పటికి ఇరువైయేడేళ్లు నిండిన యువకుణ్ణి.మాతాత జిల్లాజడ్జీపనిచేసి పింఛను

పుచ్చుకున్నాడు. నేనున్నూ ఆయనంతవాడిని కావాలని నామనస్సులో అభిలాష అగ్గలంగా వుండేది.

అల్లరిచిల్లరిగా తిరగడం మొదలయిన దుర్గుణాలేవీ నాదగ్గర లేవు. మాజాతివారిలాగ తాగే దురభ్యాసంకూడా నాకులేదు. మా జాతిలో సాధ్యమైవున్న రహస్యప్రణయాల జోలికి నే నింతవరకు ఒకసారికూడా పోలేదు. ఏదో ఓసుదినాన్ని ఓసుగుణాలరాశిని పెళ్లాడి ఒక ఆదర్శకుటుంబం స్థాపించాలని నాకు అభిలాష అగ్గలంగాఉండేది. నాకూ ఒకకొడుకు వుండాలనీ, నేను మానాన్నకి వృద్ధాప్యంలో ఉపయోగిస్తున్నట్లే అతను నాకు వృద్ధాప్యంలో ఉపయోగించాలనీ కాంక్షలు సాగించేవాడిని.

నాకు ఒకత్తే చెల్లెలు. ఆమెను మదరాసులోని ఇండియన్ బ్యాంకు మేనేజరైన పాల్‌కు యిచ్చి పెళ్ళిచేసివున్నాం. ఆమె అతనితో అనంతంగా కుటుంబసౌఖ్యం పొందుతూవుంది. ఆమెకు చిలకల్లాగా ఇద్దరుపిల్లలు. వాళ్ళ కుటుంబం వాళ్ళపిల్లల్నిచూసి నాకుకూడా పిల్లలమీదా కుటుంబంమీదా గలకోరిక తీవ్రమయింది.

మావంశంలో స్త్రీపురుషులందరూ గౌరవంగా బ్రతికేవారు. అద్భుత మేధావులు ఎప్పుడూ మావంశంలో పుట్టివుండకపోయినా తెలివితక్కువ దద్దమ్మలు ఎప్పుడూ పుట్టివుండలేదు. వాళ్ళు అందరూ సుఖంగా పెళ్ళిళ్ళు చేసుకుని శాంతంగా బ్రతికి మామూలుధోరణిలో కాలం వెళ్ళదోశారు. నావిషయంలో మాత్రం ఇందుకు వ్యతిరేకం జరుగుతుందని నేను ఎల్లా అనుకోగలను.

పైగా సరోజినితో నాకు కాబోయే వివాహాన్ని గూర్చి అందరూ ప్రశంసావా గే చెపుతూవచ్చారు. మాచెల్లెలు 'అన్నయ్యా! నువ్వు చాలా అదృష్టవంతుడివిరా. రత్నంలాంటి పిల్ల దొరికింది. మనకత్తులో శాగాకలుస్తుంది. నీ భావిసుఖానికి ఆమె ఎంతేనా సహకారిగావుంటుంది' అని అంది. ఆమాటలువిని మాఅమ్మ 'మనవంశానికి ప్రతిష్ఠ తెచ్చేపిల్ల సరోజిని' అని మాచెల్లెలు ప్రశంసకి ఉపబలంగా అంది. ఆసమయాన్ని మానాన్నకూడా 'నాయనా! ఇక నేను నిశ్చింతగావుంటాను. నీకు సుఖాన్ని ఈయగల ఇల్లాలు దొరికింది.' అని అన్నాడు.

నా స్నేహితులుకూడా యిల్లాగే నన్ను చాలా ప్రశంసించేవారు. సరోజినివంటి కన్యారత్నాన్ని పెళ్లాడగలిగినందుకు నాకు అప్పట్లో చాలా ఆనందంకలిగింది. మావివాహంకూడా చాలా వైభవంగాజరిగింది. వివాహాలంకరణాలతో సరోజిని సౌందర్యం మరింత అతిశయించింది. సిగ్గుచేత ఇంతలో ఎర్రబారుతూ, మరి అంతలో తాజాస్థితికి వస్తూవుండిన ఆమె అప్పటిచెక్కిళ్ళు నాలో సుఖమయభావాల్ని రేకెత్తించేవి.

కాని అంతలో ఆకాశం మేఘాచ్ఛాదితం అయింది. ఇద్దరం కారుమీద షికారుకువెళ్ళి యింటికివచ్చాము. భోజనంచేశాము. గది కాలుపెట్టాను. ఎప్పటిబెదురుతోనేవుంది క చేసుకున్న పెళ్లానికి వుండవలసిన చనువు క అట్టి సమయమందు స్త్రీకి ఉండవలసి ఉత్కంఠ కాని ఆమెదగ్గర కనిపించలేదు. కొంతసేపు నేను బయటికిపోయి ఆమెను ఏకాంతంగావుండనిస్తే మంచిదేమో అనుకుని బయటికివచ్చాను. నాలుగైదుసిగరెట్లు కాల్చాను. సరోజిని సౌందర్యానికి, సుగుణాలకీ తగినవిధంగా నేను ప్రవర్తింపవలసిన విధాన్ని గూర్చే అంతసేపూ ఆలోచనసాగించాను.

ఇట్టి ఆలోచనలతో ఉత్సాహం ఉప్పొంగిపోతూవుండగా తిరిగి నేను గదిలోకివెళ్లాను. గదిఅంతా చీకటిగావుంది. పడుకునేటప్పుడు ఆమె స్విచ్ నొక్కేసి పడుకునివుండాలి. స్విచ్ వేసి దీపంవెలిగించాను. నాభార్య మంచం మీద పడుకునివుంది. నా నాడి అద్భుతంగా స్పందిస్తూవుంది. నాగుండె ఉద్రేకంతో కొట్టుకుంటూవుంది. నెమ్మదిగా ఆమెవంటిమీద చెయ్యివేసి దగ్గరకుతీసుకోవడానికి ప్రయత్నించాను. ఆమె విసుక్కుని నాచెయ్యితోసేసి 'అబ్బ ! నన్ను బాధించకండి' అంది.

భరింపరాని రక్తవేగంతో బాధపడుతూవున్నాను. ఆమెను బిగియార కౌగలించుకొని స్పర్శసుఖం అనుభవిద్దామని తహతహపడుతున్నాను. అయినా ఆమె అల్లాఅనగానే తహతహ యావత్తూ తగ్గించుకుని నేనుపోయి వేరే పడుకున్నాను. ఆమెసిగ్గు పూర్తిగా తగ్గిపోయే వరకూ ఆమెను అంటకూడదని నిశ్చయంచేసుకున్నాను.

కొన్నివారాలు ఇదేమాదిరిగా వెళ్ళిపోయాయి. మేము భార్యాభర్తలమే కాని దాంపత్యధర్మాన్ని మేము ఇంతవరకు ఒక్కసారికూడా నిర్వహించలేదు. నాస్పర్శతగిలినమాత్రాన్ని ఆమెఏదో ఘోరప్రమాదం జరిగినంతగా గాభరాపడేది.

పగలుమాత్రం సరోజిని చాలాసంతోషంగాను, స్నేహపాత్రురాలుగాను కనిపించేది. మేము ఒంటరిగావున్నప్పుడు, ఆమెను చేతుల్లోకి తీసుకోడానికి నేను ప్రయత్నించినప్పుడు ఆమె భయకంపితురాలయ్యేది. క్రమంగా నాకు అర్థమయింది. సిగ్గరితనం అని నేనింతకాలంఅనుకున్న ఆమెగుణం కామవాంఛాశూన్యం అని. కామసంబంధమైన తలంపుకాని, పనిగాని చాలా అనుచితమైనవిగా ఆమెతలచిందని నేను పోల్చుకోగలిగాను.

వివాహసంబంధంచేత ఏదో ఒకగొప్ప కుటుంబానికి కట్టుబడి వసతివాళ్ళుగల ఇంటికి యజమానురాలు కావాలని ఆమెకోరివుండిందని నాకుతెలుసు. భర్తనైన నన్నుగూర్చి ఆమెచాలా గర్వంగావుండేదనికూడా నాకు తెలుసు. అయినా ఆమె సాధ్యమైనంతవరకు కామపురుషార్థంవిషయంలోమాత్రం భార్యధర్మానికి ఎడంగావుండేది. నేను ఆమెనుపెళ్లాడ్డంలో చాలా తప్పుచేశాననీ దుఃఖాన్ని కొనితెచ్చుకున్నాననీ అనుకోడం తప్పిందికాదు.

మరోరకంమనిషి ఆమెకు నచ్చివుండునేమో! కాని దరహంమీద మగవాళ్ళంటేనే ఆమెకుద్వేషం. ఆడాళ్ళని తమకామవాంఛలికి కేవలం యంత్రాల్లా ఉపయోగిస్తారని మగవాళ్ళని ఆమె పలుతడవలు నిరసించడం నేను విన్నాను.

ఒకనాడు మా చెల్లెలుయింటికి మేము విందుభోజనానికివెళ్లాం. ఒకచోట నిలిచివున్న మమ్మల్నిచూసి మాచెల్లెలు ఎంతో సంతోషించి మేము ఆదర్శకదంపతులమని అనుకుంది, అచటి ఇతరమిత్రులుకూడా అట్లాగే సంతోషించారు. కాని నిజస్థితి ఎవరికీ తెలియదు. నామనస్సుపొందే ఆందోళన ఎవరూ గ్రహించలేదు.

నేను సరోజినితో సుఖంగావున్నట్లే మా కుటుంబలోనివారు అనుకునేరీతిగా ప్రవర్తించాను. మావాళ్ళు ఆవిషయం నమ్మేరు. సరోజిని ఇంటిని చక్కగాదిద్దేది. కొద్దివ్యయంతోనే కుటుంబాన్ని చక్కగా పోషిస్తుపరిచేది. నాకు ఏయేపదార్థాలు ఇష్టమో, ఎల్లావుంటే నేను ప్రియుంపడతానో మొదలైన విషయాలన్నీ ఆమె జాగ్రత్తగా గమనించేది. ప్రతీవిషయంలోను నాసుఖమే ఆమె

మొదటిఆలోచన అయివుండేదనికూడా అంగీకరింపకతీరదు.

మాయింటికి వచ్చిపోయే చుట్టాలుకూడా సరోజిని చాకచక్యాన్ని గమనించి అతిగా ప్రశంసించేవారు. అంతటి మంచిభార్యను పొందిన నా అదృష్టానికి నిండా ఆనందించేవారు. పెళ్ళయి ఆరునెలలుఅయింది. మా దాంపత్యాని పొగడని స్నేహితుడూ, చుట్టమూ లేడు. కాని నాకు దాంపత్యసుఖమనేది లేదు. నావిచారానికి అంతులేదు.

సరోజిని నన్ను ఎప్పుడూ ఉట్టిసమయాల్లో విసుక్కొని ఎరగదు. భోజనానికి ఆలస్యంగా వచ్చినా, భోజనశాల్లో సిగరెట్టుకాల్చినా కొద్దిగా విసుక్కునేది. నేను ఎల్లప్పుడూ ఆఫీసుగదిలో కూర్చుని ఇంటివిషయం యావత్తూ ఆమెకు వదిలేయాలని ఆమెకోరిక అయినట్లు నేను తెలుసుకోకలిగాను.

ఒక్కొక్కప్పుడు రాత్రిళ్లు నామోటతనానికి ఆమె లొంగిపోయేది. కాని ఆమెలో ఏమీ ఉషారీవుండేదికాదు. ఏదో ఇష్టంలేని పనిని నిర్వహిస్తూన్నట్లుగా వుండేది. క్రమంగా నాకు ఆమెఅంటే ఉత్సాహంతగ్గిపోయింది. తిరస్కృతమైపోతూవచ్చిన నాప్రేమ క్రమంగా ఇగిరిపోడానికి ప్రారంభించింది.

ఏడాది అయేసరికి ఆమెస్వభావం నాకు కొంతవరకు అంతుపట్టింది. పైకికనిపించేవి ఆమె పామేదాతనం, ముభావం. ఆంతర్యంలో ఆమె చాలా కఠినమైన మనస్సుగలదిన్నీ, ఉదాసీనురాలున్నూ. ప్రతీదానివల్ల ఏదో అపాయమేడుందనే కుశ్శంకలు పోయేమనిషి. సన్నబట్ట కట్టుకుని సూర్యరశ్మిలో నడిస్తే మానభంగం అవుతుందని అనుమానించే స్వభావం ఆమెది.

సంతానంపొందాలని నాకు సరదా. పెళ్ళి కాకముందు సరోజిని మాయింటికి వచ్చినప్పుడల్లా మాచెల్లెలుపిల్లల్ని ఎత్తుకుని బాగా లాలించేది. అందుచేత పిల్లలంటే ఆమెకుకూడా బాగా ఇష్టంగావుంటుందని నేను అనుకునేవాడిని. కాని నిలకడమీద నిజం తెలిసింది. మా చెల్లెలుపిల్లల్ని ఆమె లాలించడమంతా కపట నాటకమనీ, ఆంతర్యంలో ఆమెకు పిల్లలంటే ఇష్టంలేదనీ ఇప్పుడు తేలింది. స్త్రీపురుషసంయోగంచేత కాకుండా మరోమార్గం దేనిచేతనయినా ప్రపంచంలో సంతానోత్పాదనం జరుగుతూవుంటే బాగుండునని ఆమె పలుసారులు అనేది. పిల్లలుంటే చాకిరీచెయ్యడం కష్టమనీ, శుచీ శుభ్రం ఉండదనీ, పిల్లల్నికని తన ఆరోగ్యం పాడుచేసుకోననీ ఆమె నిష్కర్షగా చెప్పేసింది. పిల్లలుకావలని నేను కోరినా, ఆమెకు గర్భోత్పత్తిఅయినా ఆమె నన్ను జన్మంపొడుగునా విరోధిలా భావిస్తానని చెప్పేసింది.

అప్పటినుంచీ ఇల్లంటే నాకు పెద్దపులిలా వుండేది. మానవస్వభావం ఏమిటోకాని లాలించడానికి ఒకప్రాణిని కోరుతుంది. లాలించడానికి నాకు పిల్లలులేరు. ముద్దుగావుంటుందని ఒకసారి ఒక చిన్న కుక్కపిల్లని కొన్నాను. ఇంటికి తీసుకువెళ్లాను. నాభార్య మండిపడింది. 'ఈవెధవ ఏభ్రాసికుక్కపిల్ల మనకిఎందుకూ' అని ఈసడించింది. అప్పుడు చేసేదిలేక నేను ఆకుక్కపిల్లను మాచెల్లెలుయింటికి పంపేశాను.

దినదినం పెరుగుతూవచ్చిన ఆఫీసుపనితో నాకూ, ఊలుకుట్లు మొదలైనవాటితో ఆమెకూ కాలంగడిచిపోయేది. దినంలో మేము కలిసివుండేకాలం బహుకొద్దిగావుండేది. 'పెళ్ళయిరెండేళ్లు అయినా ఇంకా నాకడుపు ఫలించలేదు. బహుశా నాకు ఆ అదృష్టం

లేదేమో!' అని అప్పుడప్పుడు మాఅమ్మతోను, చెల్లెలుతోను సరోజిని అంటూ నిట్టూర్పులువిడిచేది.

ఈనాలిక చివరిమాటలూ, ఈ దొంగ నిట్టూర్పులు నాచెవినిపడ్డప్పుడు నాలోనేనేనవ్వుకునేవాణ్ణి.మరీ ఇటీవల ఆరునెలలుగా నేనూ, నాభార్యా ఒకప్రక్కమీద పడుకునేఎరగం? ఇంక పిల్లలు ఎల్లాపుడతారు? ఒకనాటిరాత్రి ఆమె చాలామోటగా ప్రవర్తించింది. ఇక ఆమెతో తంటాలుపడి లాభంలేదని అప్పటినుంచీ ఆమెదగ్గరకు వెళ్ళడం బొత్తిగా మానుకున్నాను.

ఇక్కడ మానుకున్నా కొందరిపురుషులవలె మరోస్త్రీతో పరిచయం సంపాదించడం మొదలయిన వ్యవహారాల్లోకి నేను ఇంతవరకు దిగలేదు.

ఇల్లావుండగా ఒకనాడు ఓవిషయంజరిగింది. నాలో ఇగిరిపోతూవున్న ప్రేమను తిరిగి మొలకెత్తించి, ఇంకిపోతూవున్న ఉత్సాహాన్ని తిరిగి రేకెత్తించే పరిస్థితి ఒకటి కలిగింది. నాదురదృష్టజీవితంమూలాన్ని నాకు ఇటీవల రాత్రిళ్లు బాగా నిద్రపట్టడంలేదు. అందువల్ల ఒకనాటి మధ్యాహ్నం కోర్టుపని ఆట్టేలేని కారణంచేత ఆఫీసులో పడకకుర్చీలో బద్ధకంగా పడుకున్నాను. కళ్లుమూసుకుని కోడికునుకులోవున్నాను. ఇంతలో ఎవరో గది తలుపు తెరచి గదిలోప్రవేశించినట్లు అలికిడి అయింది.

నావద్ద టైపిస్టుగా పనిచేస్తూవున్న లూసీకన్య తలుపుతెరచి గదిలోప్రవేశించి ఏవో కాగితాలు వెతుక్కోవడం చూశాను. నాకు ఇంకా మాగన్నుగానేవుంది. కళ్లుమూసుకునేవున్నాను. ఇంతట్లో నాబుగమీద ఎవరో నెమ్మదిగా ముద్దుపెట్టుకు  యింది. ఆపెదవులు అతిసుకుమారంగాను, అతిమృదువుగాను వున్నాయి. ఇరవైతొమ్మిదేళ్లునిండిన నాజీవితంలో అల్లాంటిముద్దు నేను అంతవరకు రుచిచూచి వుండలేదు. ఆశ్చర్యచకితుణ్ణి, ఉత్సాహతరంగితుణ్ణి అయి కళ్లుతెరిచిచూశాను. నాకళ్ళఎదుట లూసీకన్య బెదరిన లేడిచూపులతో నిలిచివుంది.

నాదృష్టి ఆమెమీద పడ్డంతోటే భయంతో ఆమె సీత్కారంచేసింది. కుడిచెయ్యి గుండెలమీద వేసుకుని నొక్కిపట్టుకుంది. అప్పుడు ఆమెకు కలిగిన కలవరపాటుతో ఆమెముఖం ఎర్రబారింది. గదిలోనుంచి వెళ్ళిపోడానికి ద్వారంవైపు తిరిగింది. ఆమెతత్తరపాటు తగ్గించాలనే ఉద్దేశంతో ఆమెను పిలిచి ఒకరికి · ఉత్తరంవ్రాయవలసివుందనీ, నేను చెప్పగా దాన్నివ్రాసి తరవాత టైపుచేయమనీ చెప్పేను.

నేనుచెపుతున్నాను. ఆమెవ్రాస్తున్నది. అంతసేపూ చురుగ్గా ఊపిరివిడుస్తూ పీలుస్తూవుండి ఆమె నాకళ్ళకేసి చూడలేక పోయేది.

నేను అమందానందంలో వున్నాను. నావద్ద లూసీ చాలారోజులుగా పనిచేస్తూవున్నా ఆమెను నేను యింతవరకు ఎప్పుడూ కామదృష్టితో చూచివుండలేదు. కాని ఇప్పుడు ఆమెవైపు చాలామమకారంగా చూడ్డానికి ప్రారంభించాను. ఆమెలో ఇదివరకు ఎప్పుడూ లేని కొత్తలావణ్యమూ, కొత్తనాజూకూ నాకు కనిపించాయి. ఆమెలో ఏరీతి అందం కాని ఉన్నట్లు నేను ఇదివరకు గ్రహించలేదు. కాని ఇప్పటి నాకళ్ళకు ఆమెచర్మం ఎంతో మృదువుగాను, ఆమెనేత్రాలు ఎంతో అందంగాను ఉన్నట్లుతోచింది. ఆమెమీద నాకు ఏదో చెప్పరాని వ్యామోహం కలిగింది.

కాని ఆసమయంలో ఆమెపడుతూన్న

తత్తరపాటుకు నాకు చాలా జాలివేసింది. అందుచేత ఆమె నన్ను ముద్దుపెట్టుకున్నట్లు నాకు తెలియనట్లు, అప్పటికి నేను గాఢనిద్రలో వున్నట్లు ఆమెకు తెలియాలనేరీతిగా అప్పుడు నేను ప్రవర్తించాను. నిజానికి ఆమెముద్దు నాకు ప్రాణాలతోటిజన్మాంతరాన్నియిచ్చింది. దాన్ని గురించి ఆలోచించినకొద్దీ లూసీమీద నాకు ప్రేమాభిమానాలు పెచ్చరిల్లిపోతున్నాయి.

ఆమె అల్లరిచిల్లరిమనిషి, మగోదుర్గుణం కలదీఅయి బరితెగించింది. అయితే ఆముద్దును నా ప్రస్తుతపరిస్థితుల్లో నేను అసహ్యించుకోకపోయినా మరిచిపోయివుందును. కాని లూసీ అట్లాంటిదికాదు. ఆమె ఇంతకాలమూ నావద్ద చాలాగౌరవంగాను మర్యాదగాను ప్రవర్తించేది. స్త్రీ చాపల్యాన్ని ఎప్పుడుగాని ఏమరిపాటునేనా నావద్ద ఆమె చూపిఉండలేదు. అందుచేతనే ఆమెఅంతట ఆమెవచ్చినన్ను ముద్దుపెట్టుకుంటే నాకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆముద్దు నాజీవితంలోని ఏదోపెద్దలోటునుకుదిర్చే దివ్యమైన ఔషధంలా నాకు తోచింది.

సాయంకాలంఅయింది. ఆమె యింటికి పోవలసినవేళ అయింది. ఆమె లేచి వెళుతూంది. నేనుకూడ లేచి ఆమెతో వీధిగుమ్మందాకావచ్చేను. ఇల్లాలేచి అమెను నేను సాగనంపడానికి ఇదేప్రథమం. వీధిగుమ్మందగ్గరకు వెళ్లాక ఆమెను కారులో ఎక్కించుకునిపోయి వాళ్ళహాస్టలువద్ద దిగవిడవాలని నాకు బుద్ధిపుట్టింది. ఆసంగతి ఆమెతోఅన్నాను. అప్పుడు ఆమె నాకళ్లలోకి తేరిపారిచూచింది. నామనస్సునుచీల్చి అందలి ఆంతర్యం గ్రహించాలని ఆమె ఉద్దేశంఅయినట్లు ఆమె ఆచూపులకు నేను అర్థంచేశాను. ఇంతవరకు ఎప్పుడూ ఆమెను యింటివద్దకు తీసుకుపోయి నేను దిగవిడిచివుండలేదు. అయినా ఇప్పుడు దిగవిడుస్తానని అనడంతోటే ఆమెకాదనకుండాను, సందేహించకుండాను అంగీకరించింది.

కారుపోతూవుండగా మేము లోకంలోని అనేకవిషయాల్నిగూర్చి మాట్లాడుకున్నాం. కారు వాళ్లహాస్టలుముందు ఆగింది. ఆమె కారు దిగింది. నాగుండెలు వేగంగా కొట్టుకుంటూవున్నాయి. పట్టరానిసంతోషంలో నేను మునకలువేస్తూవున్నాను.

రాత్రిఅయింది. ఒకఆడదాని ముద్దుకు గాను ఇంతగా పిచ్చిపడ్డందుకు నన్ను నేను నిందించుకున్నాను. నాఅంత తెలివితక్కువవాడు ఇంకెవడూవుండడని భావించాను. కాని పరుపుమీద పడుకోగానే మళ్ళీ మధ్యాహ్నం ముద్దు జ్ఞాపకంవచ్చింది. అది జ్ఞాపకంవచ్చినప్పుడల్లా నాఒళ్ళు పులకరించేది. ఇంతలో నాలో నాకే అవమానభావంకలిగేది. ఈ విషయం పూర్తిగా మరిచిపోవాలని నిశ్చయించుకున్నాను. కాని. . .

మరునాడుఉదయం ల్యూసీ మామూలుగా ఆఫీసుకువచ్చింది. ఆమెపూర్తిగా మారిపోయినట్లు నాకు తోచింది. మునుపటికంటె వయస్సులో ఎంతోచిన్నదిగా కనిపించింది. మునుపటికంటె అందంలో ఎంతో అతిశయించినట్లుగా కనిపించింది. ఆమె బర్మాముడిలో బంధింపబడివున్న ప్రతివెంట్రుకా ఏదో కామజ్వాలను ప్రజ్వరిల్లచేస్తూన్నట్లుగా నాకు తోచింది. మునుపటిలాగ ఆమె ఎందుచేతనో నాయెదట నిబ్బరంగా వర్తించలేకుండావుంది. జంకు అనేభావంతో ఆమె క్రుంగుతూన్నట్లు నాకు తోచింది. నాముఖంకేసి ఆమె నిదానంగా చూడలేకపోతూంది. కాగితాలు కలాలు మొదలైనవి అందించేటప్పుడు ఆమె చెయ్యి నాకుతగిలినా నాచెయ్యి ఆమెకుతగిలినా ఆమెమొ ం గులాబిపువ్వురంగుకు మారిపోయేది.

[సశేషము]

1937 సం॥ అమ్మకమునకు సిద్ధముగానున్నవి. 1937 సం॥




కోర్టుసైజు 1-4-0. పాకెట్ సైజు 0-11-0. జమ్ సైజు 0-6-0.

# దేశోద్ధారకుని ప్రశంస

ఆంధ్రనాయకులగు విశ్వదాత దేశోద్ధారక

శ్రీ॥ కా॥ నాగేశ్వరరావు పంతులు (ఎమ్. ఎల్. ఎ.) గారి అభిప్రాయము.

## ఆంధ్రడైరీలు



గత 10 ఏండ్లనుండి సైజువారిగ వర్తకులకు, వకీళ్ళకు, ప్రజాసామాన్యమునకు, నిత్యకృత్యములందు పంచాంగముతో పాటు సామాన్యవ్యవహారములకును వినియోగపడునటులు ప్రచురించబడుతూ ప్రజాదరమును బడసినవి. డైరీలయుపయోగము వృద్ధిపొందుటకుగాను 1937 సం॥రపు డైరీలందు క్రొత్తవిషయము లనేకములు చేర్పబడినవి. ఆంధ్రాభిమానులందరు ఆంధ్రడైరీలు సకలజనోపయోగములగునటులు వీరి ప్రయత్నములను ప్రోత్సహించి యాదరించుటకు ప్రార్థితులు. ఈ డైరీలు ప్రకాశకులకును, ప్రజలకును లాభించునట్లు సప్రమాణముగను ప్రయోజనకరముగను నుండునటులు ప్రకాశకులు కృషిసల్పుదురుగాత.

(సం) కా. నాగేశ్వరరావు.

వివరములకు :—ఆంధ్రపబ్లిషింగ్‌హౌస్, తెనాలి. (లేక)

నెం 21 ఎర్రబాలుచెట్టివీధి, పోస్టుబాక్సు 142, మదరాసు.

(ఆంధ్రడైరీ ఆఫీసుక్యాలండరులు తయారుగానున్నవి.)



స్టార్ కంబైన్సువారి 'సారంగధర' ఫిల్ములో ముఖ్యపాత్రధారులు : బాలామణి - శ్రీరంజని - అద్దంకి శ్రీరామమూర్తి.

# తొలనాటి బందరు ఉప్పెన కథ

[రాత్రి ఒకగంటలో పదిహేనువేలమంది మరణించారు. నెలరోజులు రోజుకి వందశవాల వంతున సంస్కారంపొందాయి. 780 చతురపుమైళ్ళ ప్రదేశం సముద్రపునీటిలో మునిగిపోయింది.]

1864-వ సంవత్సరం నవంబరు 1-వ తేదీ నాటి సూర్యుడు తనసహస్రకిరణాలతో బందరు మహానగరంలో నలభై ఐదువేల పౌరుల యొక్క చలిని దవ్వగ జోపడానికి అప్పుడే ఉదయించాడు. కాని అంతలో వాయుదేవుడు వీరవిహారం ప్రారంభించాడు. గాలి భరింపరాని వేగంతో వీవడానికి ప్రారంభించింది. భారమితియంత్రంలో దిగతీత ఆరంభమైంది. పూర్వోత్తరదిక్కుగా ప్రచండవాయువు వీస్తోంది.

మధ్యాహ్నానికి తుపానుగాలి మరీ ఎక్కువై పోయింది. సాయంత్రం అయేసరికిఉండిన గాలితీవ్రత చెప్పడానికి తరంకానిది. పైగా కుంభవృష్టిగా వర్షంకూడా ప్రారంభమైంది. రాత్రి ఏడుగంటలయింది. పూర్వోత్తరదిక్కుగా మునపటికంటె ఎక్కువగా తుపానుగాలి కొడుతూనేవుంది.

ఎనిమిదిగంటలయింది. భారమితియంత్రం (29.500లకు) దిగిపోయింది. బందరుకోటలోని ఇళ్ళకప్పులన్నీ చీదాగా ఎగిరిపోయాయి. తలుపులు, ద్వారబంధాలు, కిటికీలు గోడల్నుంచి విడిపోయి ఇంట్లోకో, వీధిలోకో పడిపోయాయి. రాత్రి పదిగంటలయింది. వేగంలో డిందుపాటులేక గాలివచ్చేదిక్కులో కొంచెం మార్పు కనిపించింది. ఇంతలో సముద్రం పొంగి ఊరుమీదపడిందనే వార్త కోటలో అంతా తెలిసిపోయింది. ఉప్పెన హఠాత్తుగ అర్థరాత్రివేళ వచ్చిపడింది.

పదిన్నరగంటలకు ఉప్పెననీరు గొప్ప ఎత్తులోవుంది. గాలివేగం అంతకంతకు ఎక్కువే కాని తగ్గడంలేదు. తరవాత ఉప్పెనతీసింది. తీతకూడా మహావేగంగానే జరిగింది. ఉప్పెన తీసిపోయేటప్పుడు అయినశబ్దం చాలా భయంకరంగావుండింది.

పదకొండు అయేసరికల్లా ఉప్పెన నీరు తీస్తోన్నట్లు తెలిసికోడానికి ఆస్కారంకలిగింది. మంచిపునాదుల్తో కట్టిన గట్టిఇళ్ళు తప్ప మిగతాఇళ్ళన్నీ ఉప్పెనలో కొట్టుకుపోయాయి. సిపాయిలుండే బారక్సు, అచటి ఆసుపత్రి సముద్రగర్భంలోకి పోయాయి. ఆ ఒక్కచోట ఆ ఒక్కగంటలో పదిహేనువందలమంది చచ్చిపోయారు. బహుశా ఉప్పెన రాత్రి మొదటిజాములోనే ప్రారంభమైఉంటుంది. కాని సాయంత్రంనుంచీ కురుస్తూవున్న కుంభవృష్టివల్ల ఊరంతా నీటిమయం కావడంతో ఎవరూ సముద్రపుపోటును కనిపెట్టలేకపోయారు.

ఉప్పెన ఎంత ఉద్బెత్తుగా వచ్చిందో అది తీసిపోవడంకూడా అంత ఉద్బెత్తుగానే జరిగింది. పొంగులో నాశనంచేయక విడిచిన వాటిని తీతలో నాశనంచేసి ఉప్పెన భయంకరరూపంతాల్చింది.

అప్పటి ఆనమాళ్లనిబట్టి ఆసమయంలో సముద్రపునీరు మామూలుపోటుసమయాల్లోకంటె పంధ్రెండుపదమూడు అడుగులపైకి లేచిందని నిర్ణయించారు. పైగా ఆఉప్పెన సమయంలోని సముద్రమునీరు చాలావెచ్చగా

వుంది. దానినిండా భాస్వరం. కాబట్టే కెరటం కెరటానికి నీటిలోంచి మంటలా వెలుగురగులు కనిపించేది. ఆనీటితో ఒకరకమైన ఉప్పు మన్ను కొట్టుకువచ్చింది. ఆఉప్పెన నీటిలో మునిగిన ప్రదేశమంతా ఆఉప్పుమట్టితో కప్పబడింది. పైగా బందరుకోటకు సముద్రానికి మధ్యనువుండే ఒకమైలు ఇసుకపఱ్ఱ కొట్టుకుపోయింది.

ఆనాడువీచిన తుపాను గాలి మాత్రమే ఎంతో బీభత్సంచేసేదిగావుంది. దానికి ఎడతెగని వాన తోడైంది. ఈరెంటికీ మద్దత్తుగా సముద్రంపొంగి దేశంమీాదపడింది. బందరుకోట, బందరుపట్టణం, ఆ చుట్టుపట్ల ప్రదేశాలు సముద్రపునీటిలో మునిగిపోయాయి. బందరుకు ఈపక్కనా ఆపక్కనా ఎనభై మైళ్ల పొడుగునా తొమ్మిదిమైళ్ల వెడల్పునా భూప్రదేశంఅంతా జలమయంఅయింది. ఒకచోట ఆనాటి సముద్రపుకెరటం పదిహేడుమైళ్ల లోపలికి చొచ్చుకొనిపోయింది. మొత్తంమీాద ఏడువందలఎనభై చతురపుమైళ్ల విస్తీర్ణంగల భూప్రదేశం ఉప్పెనలో మునిగిపోయింది.

గట్టిపునాదులులేక సముద్రపుకెరటం తాకుతిన్న ఇళ్లన్నీ కూలిపోయాయి. రాత్రిభాగం అవడంచేత ప్రజలంతా ఇళ్లల్లోవున్నారు. కావున ఆసమయంలో ఇళ్లుకూలి కొందరూ, వరదలోపడి కొందరూ చాలాభాగం జనులు చనిపోయారు. అవస్థలు అన్నిటికీ తోడు ఆరాత్రి గాఢాంధకారంగావుంది. కూలిపోతూవున్న ఇళ్లనుంచి తప్పించుకుని బయటికిపోవడానికి బలిష్ఠులకేనా సాధ్యంకానంత తీవ్రతతో గాలివీస్తూవుంది. ఎల్లాగో ఒకలాగ పోదామనుకున్నా ఎక్కడపడితే అక్కడ ఏనుగుఈతల జలప్రవాహం. బందరుకోటలోను, పట్టణంలోను జనులు తమయిళ్లల్లో అడుగడుక్కీ పొంగుతూవున్ననీరు సముద్రపునీరని తెలుసుకోవడంతోటే ఎత్తయిన ఇళ్లల్లోకి,గట్టిఇళ్లల్లోకి పోయి తలదాచుకోడానికి ప్రయత్నించారు. కాని అల్లా ప్రయత్నించినవారిలో చాలామంది తమయిళ్లను వదిలిన మరుక్షణంలో ప్రవాహవేగానికి కొట్టుకుపోయో, నీటిలో మునిగిపోయో, గాలిచేత చెట్లకు,ఇళ్లకు కొట్టబడో చనిపోయారు.

ఆనాటి ప్రవాహవేగం ఎంతటిబలంగా ఉండిందో ఒకనిదర్శనంచూపవచ్చు. బందరుకోటకు పట్టణానికి మధ్యనువున్న పెద్దపెద్ద రాళ్ళతో మెరకచేసి పొయ్యబడ్డ బాటలోని ఏనుగులంతలేసి రాళ్ళదుంగలు అరవై అడుగుల దూరానికి కొట్టుకుపోయాయి. గాలిదెబ్బకు తాటిచెట్లు వేలకొద్దీ పడిపోయాయి. నిలిచివున్నవానిలో చాలాభాగం నిలువునా చీలిపోయాయి. టేకుదూలాలు, సామానుపడవలు, ఛిన్నాభిన్నమైన ఓడల పలకలూ జలప్రవాహానికి ఊళ్ళోకి కొట్టుకొచ్చాయి. ఇవి కొట్టుకురావడంలో వట్టినీటితాకుడుకైతే నిలిచివుండివుండే ఇళ్లు ఎన్నో కూలిపోయాయి.

ఈ ఉప్పెనలో మరణదేవతకరాళవదనాన్ని తప్పించుకొన్న కొందరికథలు అద్భుతంగావుంటాయి. కూలిపోయినఇళ్ళకప్పులను అంటిపెట్టుకునివుండి బ్రతికి బయటపడ్డకుటుంబాలెన్నోఉన్నాయి.వరదలో కొట్టుకుపోయినవారు కొందరు మధ్యమార్గంలో తగిలిన చెట్లను ఎక్కి ప్రాణాలుదక్కించుకున్నారు. కొందరు దూలాలుపట్టుకుని రెండుమూడుమైళ్ళవరకు కొట్టుకుపోయి ప్రాణాలుదక్కించుకున్నారు. బందరుకోటలోను, పట్టణంలోను జనభాప్రకారం అప్పుడు నలభై అయిదు వేలమంది నివశిస్తూఉండిరి. అందులో మూడోవంతు అనగా పదిహేను వేలమంది ఆ

ఒక్కరాత్రిలోను చనిపోయారు. బందరు దగ్గిరఉన్న ఒక బ్రాహ్మణాగ్రహారంలో ఏడు వందలమందికీ డెబ్బయిమందిమాత్రం మరునాటికి ప్రాణాలతో మిగిలారు. ఉప్పెనలో కొట్టుకువచ్చినపడవలు ఎన్నో ఈగ్రామంలో కూలిపోయిన ఇళ్లల్లో చిక్కుపడ్డాయి.

బందురు కాంటోన్ మెంటులో (అప్పుడు బందరులో కాంటోన్ మెంటుఉండేది) మరునాటికి సిఫాయిగుడిసెలు ఒకటికూడా నిలిచిలేదు. 56 గురు సిఫాయిలు, 300 మంది సిఫాయిలచుట్టాలు ఆనాడు మరణించారు.

అప్పాళ్లోని పోలీసువారిపనికూడా ఇంత శోచనీయమూఅయింది. 22 పోలీసులు, 223 మంది పోలీసువారిచుట్టాలు ఆనాడు మరణించారు. మిగిలినపోలీసులు చెల్లాచెదరు అయిపోయినందువల్ల జగ్గయ్యపేటనుంచి, గుంటూరునుంచి, బెజవాడనుంచి పోలీసుల్ని రప్పించి నగరరక్షణచేయవలసివచ్చింది.

సముద్రపునీరుఅన్ని యిళ్లల్లోకి చొరబారింది.అది తాకినపదార్థాలన్నీ పాడయ్యాయి. ఇళ్ళకప్పులన్నీ ఎగిరిపోయాయి. క్రిందినీటికి తోడు పైనించి రాత్రల్లా వర్షపునీరు సంతతధారగాపడి కొట్టుకుపోగా మిగిలిన ఇంటిలోని వస్తువులనన్నిటిని సర్వనాశనంచేసింది.

గిడ్డంగులూ, అవుట్ హౌసులూ, జంతుశాలలూ అన్నీ కూలిపోయాయి. అందుచేతనే పనివాళ్ళమరణాలు ఎక్కువగా లెక్కకొచ్చాయి. ఉప్పెన తీవ్రమైఉన్నప్పుడు కూలినఇంటికప్పులు మీదపడీ, గిడ్డంగులనుండి ఎత్తునవున్న ఇళ్లల్లో తలదాచుకోడానికి వెళ్లేప్రయత్నంలో జలప్రవాహంలో కొట్టుకుపోయీ చాలామంది మరణించారు.

ఉద్యోగస్తుల కర్రసామానూ, క్యాంపుసామగ్రీ, గుర్రాలు బళ్ళూ, అన్నీ సర్వనాశనంఅయాయి.

రోడ్లు పూర్తిగా నాశనంఅయాయి. పడిపోయినచెట్లకు లెక్కలేదు. ప్రదేశమంతా నీటిమయం. నీరుతీసినచోట ఉప్పుమట్టిమేట. కొన్నికొన్నిచోట్ల రోడ్ల ఆనమాలేలేకుండాపోయింది. చెట్లు, తుప్పలు బాటలకుఅడ్డంగా పడీ, ఇళ్లన్నీ సికస్థగావుండీ ఆప్రదేశం ఎన్నాళ్లక్రితమో జనులచే పాడుపెట్టబడిందిగా కనిపించింది.

బందరులోనేకాకుండా ఆచుట్టుపట్ల గ్రామాల్లోకూడా తుపానుగాలీ, ఉప్పెనా కలిసి చేసిన బీభత్సం వర్ణింపరానిదిగానేఉంది. కొన్నికొన్నిగ్రామాలు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. పంటలు పచ్చంపాడయ్యాయి. పశువులనేది మిగిలకుండా నాశనమయ్యాయి. మైళ్లకొద్దీ ప్రదేశం ఉప్పుమట్టితో మేటవేసేసింది. అప్పట్లో శానిటరీకమీషనరు ఇరవైయేడుగ్రామాల్ని చూశాడు.ఉప్పెనకుపూర్వం ఆగ్రామాలజనాభా 10,320 మంది. ఉప్పెనలో మరణించగా మిగిలినవారు 4893 మంది. రేపల్లె, బందరుతాలూకాలు విశేషంగా నష్టపడ్డాయి. నవంబరు 1-వ తేది నాటిరాత్రి ఉప్పెనకు ఈగ్రామాల్లో చచ్చిన మానవుల, జంతువులకళేబరాలు కొన్ని డిశంబరు 17-వ తేదీవరకుకూడా కాల్చబడకా, పూడ్చబడకా వుండిపోయాయి. శానిటరీ కమీషనర్ తనసంచారంలో పశువులకళేబరాలు కుప్పలుకుప్పలుగా పడివుండడంచూశాడు.

చావగా మిగిలినవారికిమాత్రం సుఖం ఏది ? ఊళ్లో చెఱువులు, ఏటిగట్లు మొదలయినవి బాగుచేయడానికి ప్రభుత్వంవారు కల్పించినపనుల్లోకుదిరి వారు ఎల్లాగో పొట్టపోసుకునేవారు. ముసలివాళ్లకూ, వికలాంగులకూ ధర్మంగా తిండిపెట్టడానికి కొన్నిఊళ్లల్లో

ఏర్పాటులుసాగాయి. ఒక్కరాత్రిలో ఆగ్రామాల్లోని జనులంతా నిర్భాగ్యులుగా చేయబడ్డారు. అంతక్రితంవరకు సంపన్నులుగావున్న వాళ్లెందరో మరునాటినుంచీ అన్నానికికూడా మొగంవాచినవారయ్యారు.

ఉప్పునీరు పొడిచినంతమేరా నేలమీదంతా ఉప్పుమన్ను మేటవేసింది. దాన్ని తొలగించేవరకు పొలాల్లో కర్రుసాగించడానికి వీలులేదు. ఏరుసాగడానికి పైగా ఎద్దులు కూడాలేకుండా సమూలం చనిపోయాయి.

నవంబరు 2-వ తేదీని బందరుకలక్టరు థారన్‌హిల్ ఎదుర్కొన్నకష్టం యింతా అంతాకాదు. పోయినవాళ్లుపోగా మిగిలిన పట్టణానికంతా కొంచెం యించుమించుగా అతనే ఆహారాన్ని చూపవలసివచ్చింది. ఊళ్లో నూతుల్లో అన్నింటిలోనూ ఉప్పునీళ్లు పడిపోయాయి. ఎక్కడచూసినా నీళ్లేకాని తాగడానికి పురుపెడుజలం ఎక్కడాలేదు. కొత్తనూతులు తవ్వితేగాని మంచినీళ్లులేవు. బతికివున్న వాళ్ళకి భోజనంపెట్టడంకంటె ప్రబలమైన సమస్య చచ్చినవాళ్ళని పాతిపెట్టడం. వేలకొద్దీశవాలు పడిఉన్నాయి. ఆరోజున ఒక్కబందరుకోటలోనే వెయ్యిశవాల్ని పాతిపెట్టారు. శవాల్నితగలెయ్యడానికి ఎక్కడా ఎండు కట్టెలులేవు. నవంబరు 2-వ తేదీమొదలు డిశంబరు17-వ తేదీవరకు రోజుఒక్కంటికి నూరేసి శవాలవరకూ కాల్చబడడమో, పాతిపెట్టబడడమో జరిగేది. తుపానువెళ్ళిన కొత్తలో శవాల్ని పాతినచోట్లల్లో తిరిగి మన్నుపోసి జాగ్రత్తచేయబడ్డాయి. శవాల్ని తింటూ వచ్చిన కుక్కల్ని, పందుల్ని చంపడం ఒక పెద్ద సమస్యఅయింది. వాటిని చంపినవాళ్లకి బహుమానాలుకూడా ఇచ్చేవారు. ఈసందర్భంలో శానిటరీపనులనిమిత్త నవంబరులో 10,177 రూపాయలు, డిశంబరులో 1613-7-0 రూపాయలు ఖర్చుచేయబడెను.

780 చతురపుమైళ్ళ ప్రదేశం ఒక్కనాటితో పాడయిందంటే చాలా హృదయవిదారకంగా వుంటుంది. పశునష్టమూ, ప్రాణనష్టమే కాకుండా బ్రతికున్నవాళ్ళకు తిండిలేకుండా పంటలు పచ్చము పాడయ్యాయి. బ్రతికున్న రైతులకు పశువులుకాని, విత్తనాలకి గింజలుకాని లేకపోవడంచేత ఉప్పెనవల్ల చేసినవ్యవసాయం చెడిపోవడానికి తోడు కొత్తగా వ్యవసాయంచెయ్యడానికికూడా వీలులేకుండాపోయింది.

చల్లపల్లి, వల్లూరు, కృత్తివెన్ను జమీందారీలుకూడా బాగా నష్టపోయాయి. చల్లపల్లిరాజా యార్లగడ్డ అంకినీడు బహాదూరు సుందరభవనం పూర్తిగా పాడయింది. ఆయనకు ఉండుకున్న 66 గ్రామాల్లోనూ 40 గ్రామాలు ఉప్పెనలో మునిగిపోయాయి. అందులో 10 గ్రామాలు పూర్తిగా పాడయ్యాయి. ఆయన చెల్లింపవలసిన 88 వేల రూపాయిల పేష్కస్సులోను 66 వేల రూపాయిలు రెమిషన్ ఈయవలసిందిగాను, 30 వేల రూపాయిలు ఆయనికి అప్పుఈయవలసిందిగాను ప్రభుత్వంవారికి శిఫారుసుచేయబడ్డది.

వల్లూరురాజా జమీందారీలో గూడూరు పరగణాకుచెందిన 30 గ్రామాలు ఉప్పెనదెబ్బకు గుటికయ్యాయి. ఈగ్రామాలమీద ఇవ్వవలసిన 33 వేల రూపాయిల పేష్కస్సులోను 22 వేల రూపాయిల రెమిషన్ శిఫారుసుచేయబడింది. వల్లూరురాజా అప్పటికి చాలాధనవంతుడు అయివుండడంచేత ఆయనికి అప్పువిషయంలో ఏమీా శిఫారుసు

జరగలేదు. కృష్ణాజిల్లాకంతటికీ అబ్కారీ కంట్రాక్టు అప్పట్లో వల్లూరి రాజాది. అబ్కారీపాటమొత్తం ఒకలక్షానలభై ఆరు వేలరూపాయిలు. గతవత్సరం పాటమొత్తం కంటె ఇది 50 వేలు అధికం. అసలే పాట మొత్తం అధికమైఉండడం, పైగా తుపానుచేత కల్లుయిచ్చే తాటిచెట్లు చాలాభాగం నాశనంకావడం, ఇందుకుతోడు చాలామంది జనులు చనిపోవడం, బ్రతికివున్నవారి సంపాదనశక్తిపోయి కొనుగోలుశక్తితగ్గడం కలిగింది. ఈకారణాలచేత అబ్కారీపాటమొత్తం 1,46,000 వేలనుండి 36,500 లకు తగ్గించబడింది.

కృత్తివెన్ను జమీందారీ తొమ్మిదిగ్రామాల చిన్నజమీ. దాని పేష్కస్సు 3 వేల రూపాయిలు. ఆ జమీందారీలో ఆరుగ్రామాలు ఉప్పెనలో మునిగిపోయాయి. ఆ జమీందారుకు 2 వేల రెమిషన్, 5 వేల అప్పు శిఫారుసు చేయబడ్డది.

16,193 రూపాయిల పెట్టుబడితో పుల్లేరు నుంచి మచిలీపట్టణంవరకు తవ్వబడ్డ కాలవ నవంబరుతుపానుకు పూర్తిగాచెడిపోయింది. సూల్తానగరంవంతెన చీదాగా కూలిపోయింది. ఉప్పెనవల్ల బందరులో మంచినీళ్లకు కరువురాగా సూల్తాన్‌నగరం వంతెనవద్ద నుంచి రాబర్టుసన్‌పేటవరకు కాలవతవ్వారు. తుపానుమూలంగా పబ్లిక్‌వర్క్సుకుగాను ఆ యేడు క్రిందివ్యయాలు చేయబడ్డాయి.

| | |
|---|---|
| బందరుకాలువ, దానిశాఖలకు | 52,710 |
| ఏలూరుకాలువ | 9,756 |
| రైవస్‌కాలువ | 3,499 |
| పుల్లేరుకాలువ | 12,640 |
| నైజాంపట్నంకాలువ | 14,102 |
| వెస్టరన్‌బ్యాంక్ ఛానల్ | 3,381 |
| కొమ్మమూరుకాలువ | 6,754 |

ఉప్పెనకు ఫలితంగా బందరులోవుండే సిపాయిలరెజిమెంటు సామర్లకోటకు మార్చబడింది. తుపానులో చనిపోయిన సిపాయిల కుటుంబాలకు రెండేసినెలలజీతాలు యీనాంగా ఈయబడ్డాయి. ఆకుటుంబాలు వాళ్ల వాళ్ల ఊళ్లకువెళ్లడానికిన్నీ అయేఖర్చు గవర్నమెంటువారే పెట్టుకున్నారు.

బందరు సముద్రంలోని మెరయిన్ డిపార్టుమెంటువారి పడవలు కొన్ని ఆరుమైళ్ల లోప్రదేశానికి కొట్టుకుపోయాయి. గవర్నమెంటువారి ట్రెజరీకూడా పచ్చంపాడైపోయింది. అన్ని గవర్నమెంటుడిపార్టుమెంటుల రికార్డులూ పూర్తిగా నాశనంకాకపోయినా బొత్తిగా నిరుపయోగంఅయాయి. కొత్త నూతులు తవ్వబడేవరకు బందరుపౌరులు నీటికోసంపడ్డ ఇబ్బంది వర్ణించిచెప్పరానిది.

ఉప్పెనవార్త మదరాసుచేరినతోడనే బట్టలు, మందులు, తినుబండారములు అరేబియాఅనే ఓడద్వారా బందరుకు పంపారు. అది బందరు 17-వ తేదికి చేరింది. బందరు సముద్రపుపడవలన్నీ స్వరూపనాశనం అయినందువల్ల కాకినాడనుంచి క్రొత్తవి రప్పించారు. అప్పటినుంచీ బందరులో కంటోన్‌మెంటు తీసేశారు. జిల్లాహెడ్‌క్వార్టర్సుమాత్రం అక్కడే వుంచడానికి నిశ్చయంచేశారు. మదరాసులోనూ, బొంబాయిలోనూ విరివిగా చందాలు వసూలుచేసి బందరులోని ఆపన్నులకు పంపినారు. ఉప్పెనతీసిపోయాక బందరులో జనవరిమాసంలో రక్తగ్రహణి, అతిసారవిరేచనాలుప్రబలి ప్రజల్ని బాధించాయి. కాని ఆరోగాలవల్ల మరణాలుమాత్రం విశేషంగా సంభవించలేదు.

తుపాను నష్టనివారణకుగాను ప్రభుత్వం

వారు 30 వేలు శాంక్షన్ చేశారు. తుపాను మూలంగా టెలిగ్రాఫ్ తీగెలు తెగిపోయాయి. గాలివానకు బెజవాడదగ్గరవున్న భవానిపురములో 12 గురు, విద్యాధరపురములో 1 రు మరణించారు. కాలవల్లో దోనెలు, రహదారీపడవలు, డి.పి.డబ్లుయువారి స్టీమ్ డ్రెడ్జరు, మూడు పంట్లు మునిగిపోయాయి. ఏలూరునుంచి ఆ నాడు బెజవాడ ఒకపడవమాత్రం వచ్చింది. మిగిలినవన్నీ మునిగిపోయాయి. బెజవాడ సీతానగరం కొండలమీది టెలిగ్రాఫ్ తీగెలు తెగిపోవడంచేత సీతానగరంలో టెంపరరీగా ఒక ఆఫీసుపెట్టి అచ్చటినుంచి వార్తలు బెజవాడకు పడవలమీద తెప్పించేవారు.

మంగనపూడి, చినగంజాము, బంటుమిల్లి ఉప్పుకొఠారులు పూర్తిగా చెడిపోయాయి. నవంబరు 8-వ తేదికి ధాన్యందంపుకుని బియ్యం చేసుకోడానికి తగ్గఅవకాశం బందరు ప్రజలికి కలిగింది. 10-వ తేదికి కాని కచేరీలు తెరవడానికి వీలులేకపోయింది. ట్రెజరీలో రొక్కం ఏమీపోకపోయినా స్టాంపులుమాత్రం పూర్తిగా పాడయాయి. బందరుకోటకు మార్గం 10-వ తేదికి కొంత బాగుచేయబడింది.

సిడ్నీ అనేఓడలో మదరాసునుంచి తిరిగి బట్టలు, తినుబండారాలు, మందులు పంపబడ్డాయి. నవంబరు 16-వ తేదిని మద్రాసులో బహిరంగసభ జరిగి బందరు తుపానునష్టానికి విరాళాలు పోగుచేయడానికి నాయకుల సంఘం ఏర్పాటయింది.

బాపట్ల తుపానుతో దుఃఖపడుతూవున్న ఆంధ్రులకు డెబ్బయియేళ్ళనాటి ఈబందరు ఉప్పెనకథ మరింతదుఃఖాన్ని తెచ్చుకొట్టేదిగా వుండగలదు. అయినా ఈకష్టసమయంలో ఇల్లాంటి కష్టాలుపడ్డ మనతాతలు జ్ఞాపకం రాకమానరు.



**Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.**
Editor & Publish...